# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక



13 - 12 - 1950

నాలుగు అణాలు

# విషయానుక్రమణిక

## 13 డిశంబరు 1950

వ్యాసాలు:



సీరియల్:



కథలు:



సినిమా:



బొమ్మరిల్లు:



గేయం:





# ఆంధ్రపత్రిక

సంవత్సరచందా
రు. 12-0-0
విడిప్రతిక
4 అణాలు

ప్రతి బుధవారము
ప్రకటింపబడును
**Founder : K. NAGESWARA RAO**

సంపుటము **43**
సంచిక **14**

వికృతి సంవత్సర కార్తీక శుద్ధ పంచమి బుధవారము






శ్రీ అరవిందయోగి
డిసెంబరు **5-12-50**
రాత్రి 1-30 కి
పరమపదించారు.





మన దేశం:

# గ్రామాలలో రేషనింగ్

### అన్నం బ్రహ్మ

గ్రామసీమల్లో రేషనింగు ఎత్తివెయ్యటానికి మద్రాసు ప్రభుత్వం నిశ్చయించింది. కారణం: ఈ రేషనింగు అమలుజరపటంలో రాష్ట్రప్రభుత్వం అపూర్వమైన అసమర్థత ప్రకటించింది. అనేకచోట్ల రేషన్‌షాపుల్లో ఆహారధాన్యాలు నిండుకున్నాయి. ప్రజలు నానాఅగచాట్లూ పడ్డారు. అన్నంబ్రహ్మ అన్న ఆర్యోక్తి రుజువుచేస్తూ అన్నం బ్రహ్మస్వరూపంలాగా అవాఙ్మానసగోచరమైపోయింది. గ్రామసీమల్లో ప్రజలకు ఆహారధాన్యాలు అందించే బాధ్యతకు మద్రాసుప్రభుత్వం స్వస్తిచెబుతున్నది.

మద్రాసుప్రభుత్వం అసమర్థతకు కొంత కారణం పంటలు సరిగా పండకపోవటం. కాని ఇంకా ఇతరకారణాలున్నాయి.

రేషనింగు అమలుజరపటంలో రెండు ఉద్దేశాలుంటాయి: ఆహారధాన్యాల ధరలు అదుపులో ఉంచటమూ, ఆహార కొరత ఉన్నప్రాంతాలకు ఆహారధాన్యాలు అందించటమూనూ.

రేషనింగు సరిగా అమలుజరపాలంటే ప్రభుత్వంవద్ద ధాన్యం ఉండాలి. ఇది రెండువిధాలుగా లభిస్తుంది. ధాన్యసేకరణ ద్వారానూ, ఆహారధాన్యాల దిగుమతి ద్వారానూ. ఆహారధాన్యాలు పైదేశాల నుంచి దిగుమతిచేసి రాష్ట్రాలకు అందించే భారం ప్రభుత్వానిది.

రేషనింగుభారం మీదవేసుకున్న రాష్ట్రప్రభుత్వం రేషన్‌డిపోలు నిండుకోకుండా చూడాలంటే సవ్యంగా ధాన్యసేకరణ చేసి, లోటును కేంద్రంనుంచి అడిగి పుచ్చుకోవాలి. ఈ పని రాష్ట్రప్రభుత్వం సరిగా నిర్వర్తించని కారణంచేత గ్రామసీమల రేషనింగుకు ఉద్వాసన చెప్పవలిసిన పరిస్థితి ఏర్పడింది.

ధాన్యసేకరణవిషయంలో మద్రాసు రాష్ట్రంలో అనేక అవకతవకలు జరిగాయి. ఇవి మిగులుజిల్లాలు, ఇవి తరుగు జిల్లాలు అని బండఅంచనా పెట్టుకుని ధాన్యసేకరణ చేసి "మిగులు" జిల్లాల్లో క్షామం తెచ్చిపెట్టారు. క్షామం దొంగవ్యాపారానికి ప్రోత్సాహం ఇచ్చింది.

రాష్ట్రమంతటా కలిసి తరుగు ఎంత ఉంటేదీ రాష్ట్రప్రభుత్వం అంచనా కట్టినట్టయితే ఆ అంచనాప్రకారం కేంద్రం నుంచి ఆహారధాన్యాలు తెప్పించుకుని ఎక్కడ లోటుంటే అక్కడికి అందజేయవచ్చు. ఆహారదిగుమతులుకూడా దేశం లోటును తీర్చలేనినాడు ఆకలిచావులు తప్పనేతప్పవు.

రేషనుడిపోలు ఖాళీఅయినచోట్ల ఆకలిచావులు హెచ్చుగా లేకపోతే అక్కడ దొంగమార్కెట్టు సాగుతున్నదన్నమాట. గ్రామసీమల్లో రేషనుషాపులు ఖాళీచేసినా, రేషనింగు ఎత్తివేసినా పర్యవసానం ఒకటే.

### అవ్వ పెట్టదు, అడుక్కోనీదు

రాష్ట్రఅసెంబ్లీలో ఈ విషయమై జరిగిన చర్చలో కొందరు ఆహారమంత్రిని కేంద్రం నుంచి అదనపు ఆహారధాన్యాలు తెప్పించమన్నారు. అవసరానికి మించి అడగటం మంచిదికాదని ఆయన అన్నాడు. ప్రస్తుతం రాష్ట్రం పుచ్చుకునే ఆహారం అవసరాలకు సరిపోయేపక్షాన రేషనింగు ఎందుకు ఎత్తివేయాలో ఆయన చెప్పలేదు.

రేషనింగు ఎత్తివేసేపక్షాన దొంగమార్కెటుకేసులు పట్టుకోవటం మానమని ఒకరు సలహా ఇచ్చారు. ఈ సలహా పాటించినట్టయితే ధాన్యం ఏదోధరకు బయటికి వస్తుందిగాని పేదవాళ్ల ఆకలిచావులు తప్పవు.

(7-వ పేజీ చూడండి)

# అమెరికా అంపశయ్య

## "ఈసారి మావంతు"

కొందరు సినిమా తారలు నాలుగు చిత్రాలలో నటించి నాలుగు పిచ్చికలు సంపాదించేసరికి సొంతాన చిత్రం తీయాలని దురద పుడుతుంది. తీస్తారు. ఉన్న నాలుగు పిచ్చికలూ ఎగిరి చక్కాపోతాయి. ముందు నటించబోయే నాలుగు చిత్రాల ఆర్జన డిస్ట్రిబ్యూటరుకు ముందుగానే తాకట్టయిపోతుంది. ఉన్న కీర్తి కాస్తా నాశించిపోతుంది. అమెరికా సంగతి అవిధంగా అవుతున్నది.

"రెండు ప్రపంచయుద్ధాలలో మేం అందరికన్నా ఆఖరుగా ప్రవేశించాం. ఈసారి ప్రపంచయుద్ధానికి అందరికన్నా మేమే ముందుంటున్నాం," అని అమెరికనులు చంకలు గుద్దుకున్నారు. మొదటి ప్రపంచయుద్ధం అయేసరికల్లా ప్రపంచంలో ఉండిన బంగారంయావత్తూ అమెరికా చేరుకుంది. రెండో ప్రపంచయుద్ధం అయిపోయేసరికి ప్రపంచంలో ఎక్కడా డాలర్లు లేవు. ఎన్నో దేశాలు డాలర్లకోసం రాజకీయంగా అమెరికాకు అమ్ముడుపోవటానికి సిద్ధపడ్డాయి. అగ్రరాజ్యాలనిపించుకున్న బ్రిటను, ఫ్రాన్సులు డాలర్లకోసం చాలా ఇక్కట్లకు తమ ప్రజలను గురి చేశాయి.

అమెరికాకోరిక నెరవేరినట్టే కనపడింది. ఉత్తర అట్లాంటిక్ ఒడంబడిక కుదిరింది. పశ్చిమ రాజ్యాల యూనియన్ అమెరికా కర్రపెత్తనంకింద ఏర్పడింది. ప్రపంచమంతటా అమెరికాకు స్థావరాలు దొరికాయి. బ్రిటిషువారు షూమన్ పథకానికి వెంటనే ఒప్పుకోకపోయినా కాలక్రమాన ఒప్పుకుంటారన్న ఆశ ఒకటి ఏర్పడింది. యూరప్ సమిష్టి రక్షణపథకంకింద పశ్చిమ జర్మనీని సాయుధం చెయ్యాం వసేమిరా అని ఫ్రెంచివా రన్నప్పటికీ ఫ్రాన్సు పిలక అమెరికాపట్టునుంచి జారిపోలేదు. అంతా బాగానే ఉంది. ఇంతలో కొరియా దాపరించింది.

కొరియాను అమెరికా తెచ్చిపెట్టుకోలేదనే అనుకుందాం. కాని అందులో అమెరికా తల దూర్చింది. తల దూర్చటానికి ఎంతో ఉబలాటం ప్రదర్శించింది. కొరియా - ముఖ్యంగా ఉత్తరకొరియా - బెత్తెడు దేశం. అక్కడివాళ్లు మృగప్రాయులు. "హూష్ కాకి" అందామనుకుంది అమెరికా. కొరియా బెదరలేదు. కాకి పొడిచి నట్టు పొడవసాగింది.

కొరియాకోసం యుద్ధప్రయత్నాలు అదనంగా చెయ్యవలిసివచ్చింది. ట్రూమన్ డాలర్లు కొరియాకు ఆహుతి చేయసాగాడు. ప్రపంచంలో డాలరుకొరత పూడింది. బ్రిటిషు సవరను ధరా, గిరాకీ హెచ్చింది.

కొరియాలో ఐక్యరాజ్యబలాలు ఓడి నంతపని అయి, మళ్ళీ గెలవసాగాయి. కనీసం ఉత్తరకొరియనులు దక్షిణకొరియా విడిచి వచ్చేశారు. కొరియా యుద్ధం అయిపోయినట్టూ అమెరికా పరువు నిలబడ్డట్టూ కనపడింది.

## మకార్థర్ కుదేలు

ట్రూమన్ ఒకటి తలిస్తే మకార్థర్ మరొకటి తలిచాడు. మకార్థర్ అమెరికా రాజకీయాలను పరధనంగా భావించి ఉత్తరకొరియాలో మూటం బేస్తు బెట్టి కుదేలు చేశాడు. ఆయన ఐక్యరాజ్య తాత్కాలిక కొరియా కమిటీవారు చేసిన నిర్ణయాన్ని తృణీకరించి సింగ్మన్ రీ బలాలను ఉత్తరకొరియా బలాలవెనకగా 38వ అక్షాంశ రేఖ దాటి పంపాడు. ఉత్తర కొరియా ప్రాంతంలో దక్షిణకొరియా ప్రభుత్వం అడుగు పెట్టరాదని పైన చెప్పిన తాత్కాలిక కమిటీ నిర్ణయం అయినప్పటికి సింగ్మన్ రీ ప్రభుత్వం తాలూకు గవర్నరులూ, పౌరపరిపాలనాధికారులూ "అధ్యాపకులూ" ఉత్తరకొరియా ప్రవేశించారు. ఉత్తరకొరియాలోకి పంపడమే కాక దక్షిణకొరియనుబలాలను మంచూరియా సరిహద్దువరకూ పొమ్మనికూడా మకార్థర్ ఆదేశించాడు.

తరువాత అమెరికా ఐక్యరాజ్యసమితి చేత ఐక్యరాజ్యబలాలను ఉత్తరకొరియా ప్రవేశించే అనుమతి ఇప్పించటం కేవలం మకార్థర్‌ను అమెరికా విదేశాంగశాఖ ధిక్కరించలేకపోవటమే గాని మరొకటి కాదు.

పిట్టపోరూ పిట్టపోరూ పిల్లి తీర్చిందన్నట్టు చైనా "వాలంటీర్లు" (లేక బలాలు) మకార్థర్ మూటంబేస్తును కుదేలు చేసేశాయి. ఐనా గెలుపు నాదే నన్నాడు మకార్థర్. "ఉత్తరకొరియా బలాలను మంచూరియాసరిహద్దుదాకా తరిమి ఐక్యరాజ్య నిర్ణయం అమలుజరిపాను. కొత్తగా చైనాయుద్ధం ప్రారంభించింది. నాకు కొత్త ఉత్తరువు లివ్వండి," అన్నాడు మకార్థర్.

## "పక్క వేసుకున్నావు, పడుకో"

అమెరికా ప్రభుత్వశాఖపని అన్నందాలా అగచాట్లే అయింది. కొరియాయుద్ధం అనకున్నట్టు జరగకపోగా మానం కాపాడుకునేటందుకు చైనాతో యుద్ధానికి దిగవలసిన పరిస్థితి ఏర్పడింది. 1951 కి గాను అంచనా వేసుకున్న యుద్ధఖర్చు కాస్తా -1950 తిరక్కముందే మంజూరు చెయ్యవలసి వచ్చింది. యుద్ధం కొరియా సరిహద్దులలో ఉండగానే అమెరికాకు తీవ్ర పరిస్థితి ఏర్పడితే, 'ఈ యుద్ధం చైనాకు వ్యాపింపజేయాలంటే' ఏమయ్యేదీ వూహించవచ్చు. కొరియాయుద్ధాన్ని అణువు బాంబులతో ముగించడానికి అమెరికా మిత్రదేశా లేవీ సమ్మతించలేదు. ఆఖరుకు ఆస్ట్రేలియా, కెనడాలు కూడా అక్షింతలు వేశాయి.

ఇన్నేళ్ళు అగచాట్లుపడి సాధించిన పాశుపతాస్త్రాన్ని రష్యామీద ప్రయోగించకుండా ఊరూ పేరూ లేని కొరియా సరిహద్దులో వ్యర్థంచెయ్యటం చర్చిల్ ప్రభృతు లెవ్వరికీ ఇష్టంలేదు. అసలు యుద్ధం యూరపులో రావాలనీ, బలసంపదలన్నిటినీ అక్కడే ధారపోయాలనీ వారి మతం.

అయితే ఇక్కడకూడా అమెరికాకు అవాంతరాలు కలుగుతున్నాయి. బ్రిటిషు వర్గాలలో చాలామందికి యుద్ధయత్నాలమీదా, అమెరికా నాయకత్వంమీదా ఉన్న

టుంటే మోజు తగ్గిపోయింది. బ్రిటనునుండి రకరకాల సూచనలు వెలువడ్డాయి. "యూరపు రక్షణలకింద ఎవ రెంత ఖర్చు చేయాలో అమెరికా చెప్పరాదు. ఎవరి శక్తికి తగ్గట్టు వారు ఖర్చుచేయాలి. మొత్తం మీద జరిగే సమష్టిప్రయత్నం యుద్ధాన్ని తెచ్చిపెట్టేటంత పెద్దఎత్తున ఉండరాదు. అమెరికా కర్రపెత్తనం చెయ్యరాదు. అందరికీ ఈ ప్రయత్నంలో సమాన హక్కులుండాలి."

ఈ ధోరణినే క్రమంగా ఇతర దేశాలు కూడా ప్రకటిస్తాయని భావించవచ్చు. కొరియాలో అమెరికాసేనలు అంతో ఇంతో విజయం సాధిస్తుండగా జరగని విమర్శలు ఇప్పుడు బయల్దేరాయి. చైనా సేనల చేతిలో "ఐక్యరాజ్య" బలాలు చావుదెబ్బ తింటూంటే, మకార్థర్ ఐక్యరాజ్యఆదేశాలను అతిక్రమించాడన్న ప్రసక్తి వచ్చింది. ఈ ఆరోపణ అధికార రీత్యా జరగకపోయినా పలుకుబడిగల వర్గాల నుంచే జరుగుతున్నది. ఇందులో అసత్యం కూడా అట్టే కనబడదు. సింగ్మన్‌రీ బలాలను మకార్థర్ ఉత్తరకొరియాలోకి పంపటం ఒక నిదర్శనం. ఐక్యరాజ్య విమానాలు చైనా సరిహద్దుపైకి వెళ్ళి యుద్ధప్రేరేపక చర్యలు జరపడం మరొక నిదర్శనం. ఇంగ్లీషులో పక్క వేసుకున్న వారు పడుకోక తప్పదన్న సామెత ఉన్నది. అమెరికా ఇప్పుడా పనే చేస్తున్నది.

## అమెరికా దౌర్బల్యం

అమెరికా పూర్తిగా రాజకీయ ఓటమి పొందకపోవచ్చు. కాని దౌర్బల్యచిహ్నాలు చాలా పొడచూపుతున్నాయి. యుద్ధఖర్చుమూలంగా అమెరికాలో ధరలు చాలా పెరిగిపోతున్నాయి. ఈ పెరుగుదలకు ప్రస్తుత కారణం ఉత్పత్తిదార్ల దురాశే. ఎందుచేతనంటే యుద్ధప్రయత్నాలను అడ్డంపెట్టుకుని వారు వస్తువుల ధరలు పెంచేస్తున్నారేగాని వారి రాబడిలోనూ, వాటాల ధరలలోనూ తరుగుదల ఏమీ కనిపించటంలేదు.

దీనికి తోడుగా - ఇదొక కారణంగా కూడా నేమో! - నవంబరు 7 న జరిగిన కాంగ్రెసు ఎన్నికలలో రిపబ్లికనులు తమ స్థానాలను బలపరుచుకున్నారు. డీన్ ఎచిసన్ మొదలైన కొందరు ప్రముఖ వ్యక్తులకు ఉద్వాసన చెప్పటానికి యత్నాలు జరుగుతున్నాయి.

మకార్థర్ బుద్ధిపూర్వకంగా చైనాను రెచ్చగొడుతుంటే మకార్థర్‌కూ, అమెరికా విదేశాంగశాఖకూ ఎక్కడా పొరపొచ్చాలు లేవంటూ ట్రూమన్ చైనాకు, "మీ సరిహద్దులను గౌరవిస్తాం. మీరు కొరియానుంచి పొండి," అని వాగ్దానాలు చేస్తున్నాడు. ఈ సమయంలోనే అమెరికా ఒత్తిడితో ఇండోచైనాలోనీ ఫ్రెంచి బలాలు అటునుంచికూడా చైనాసరిహద్దుపై దాడులు చేస్తున్నట్టు తెలుస్తున్నది.

ఒక ముక్కలో చెప్పాలంటే అమెరికాకు నిర్దిష్టమైన దూరప్రాచ్యవిధానమన్నది ఈ నాటికి లేదు. అది లేకుండానే అమెరికా దూరప్రాచ్యంలో తల ఇరికించి కూర్చున్నది.

## "ఆసియా మనని నమ్మదు"

పెసిఫిక్ సంబంధాల సంస్థ లక్నోలో సమావేశమైనప్పుడు వెరామిచిలిస్‌డీన్ అనే ఆవిడ అమెరికాతరఫున వచ్చి ఆ సమావేశంలో పాల్గొన్నది. తదనంతరం ఆవిడ అమెరికా వారికి ఆసియాప్రజలు అమెరికానెందుకు నమ్మరో తెలియజెప్పింది. ఆవిడ చెప్పిన కారణాలు మూడు: (1) అమెరికా ఒక పవర్ బ్లాక్. తాను నిర్మాణకార్యక్రమం తలపెట్టి ఉండి ఇండియాకు అంతర్జాతీయ గుంజాటనలలో చిక్కుకోవటం ఇష్టంలేదు. (2) భారతీయులు రష్యాను విమర్శిస్తారుగాని కమ్యూనిజంమీద వారికి ఆదరం లేకపోలేదు. (ఒక నేతపారిశ్రామికుడు నెరాను, "ఏ దేశమైనా కమ్యూనిజం కోరితే మీ రెందుకు అడ్డం తగులుతారు ?" అని అడిగాడు.) పాకిస్తాను వారిలోకూడా ఇదే వైఖరి కనబడుతుంది. (3)యూరప్‌తో పోలిస్తే ఆసియాకు అమెరికా ఇవ్వజూపుతున్న సహాయం చాలా కొద్ది. ఈ కాస్తా పుచ్చుకున్నట్టయితే అమెరికా ఆసియా దేశాలను రష్యా వ్యతిరేక యుద్ధంలో ముంచుతుందేమోనని ఆసియా దేశాలకు భయం.

ఈ భయాన్ని అమెరికా పోగొట్టే స్థితిలో లేదు. ఒకవంక తనను నమ్మిన పశ్చిమరాజ్యాలకే అమెరికా సందేహాలు తెచ్చిపెడుతున్నది. ఈ అంపశయ్యనుండి అమెరికా ఎప్పుడు ఏవిధంగా విముక్తి చెందేదీ చెప్పటం సులభం కాదు.

## అమెరికాలో అలజడి

ఈ లోపల వాషింగ్టన్‌లో బ్రిటిషు ప్రధాని అట్లీ, అమెరికా అధ్యక్షుడు ట్రూమన్ ఆరు సమావేశాలు జరిపిన ఫలిత మేమంటే, కొరియానుంచి ఐక్యరాజ్య సేనలు ఓడి పారిపోవట మనేది ఉండరాదనీ, అయితే రాజీబేరాలు సాగిస్తామనీనూ. దురాక్రమణదార్లను దువ్వటం జరగరాదని ఇద్దరూ ఒప్పుకున్నారు. అట్లీ ప్రయాణం ప్రమాదపరిస్థితి నివారిస్తుందన్న ఆశను ఈ నిర్ణయాలు బలపరచటం లేదు.

రాజీబేరాలకు పెకింగ్ ప్రభుత్వం ఒప్పుకున్నట్టు తెలియజేసినమాట నిజమే కాని, అమెరికా బ్రిటనులతో సమాన హోదా ఇస్తేనేగాని చీనా రాజీమాటలకు ఒప్పుకోదు. అమెరికా చీనాను గుర్తించటం విషయానికి ఇంకా సముఖంగా లేదు. ఈ విషయమై అట్లీ ట్రూమన్‌లకు రాజీ కుదరనేలేదు. యుద్ధంలో ఓడినా, రాజీపడి యుద్ధం మానినా కూడా చీనావారు అమెరికాకు ఆవగింజంత సందివ్వకుండా దూరప్రాచ్యాన్నుంచి పంపిస్తారుగాని వదలరు. అమెరికాధోరణి దీనికి అనుకూలంగా లేదు కమ్యూనిజం ఎక్కడ తలఎత్తినా ప్రతిఘటించేదేనని అట్లీ ట్రూమన్‌లు ఒప్పుకున్నారుకూడానూ. ప్రస్తుతం దూరప్రాచ్యంలో సాంఘిక రాజకీయ చైతన్యం చూపుతున్నది కమ్యూనిజం ఒకటే.

తరవాత చీనా అమెరికాలకు రాజీ కుదిరినా కుదరకపోయినా ప్రస్తుతం అమెరికాలో పరిస్థితి అల్లరీ అయోమయంగా ఉంది. ఉత్తరకొరియాలో తగిలే దెబ్బలకు తట్టుకోలేక అమెరికాలో అనేకరకాల వారు అనేకరకాలుగా ఆర్భాటాలు సాగిస్తున్నారు. "కొరియానుంచి మన కుర్రాళ్లను బయటికి లాగండి" అని ఒకరూ, "కమ్యూనిస్టు దురాక్రమణదార్లను దువ్వే నమ్మకద్రోహులైన ఫ్రాన్సు, బ్రిటనులను" తిట్టిపోసేవారు మరొకరూ, అమెరికా విదేశాంగవిధానాన్నీ, చర్యలనూ తీవ్రంగా విమర్శించేవారు వేరొకరూనూ!

కాలిఫోర్నియా ప్రతినిధి అయిన సెనెటర్ నోలాండ్ (రిపబ్లికన్) అందరికీ హెచ్చరికలు పారేశాడు; చైనాను కొరియానుండి బయటికి నడవమన్నాడు; అట్లీని "మ్యూనిక్" నుంచి వెళ్లిపొమ్మన్నాడు; చీనాజాతీయవాదులను ట్రూమన్ యుద్ధంలోకి దించాలన్నాడు; అమెరికా చీనా తీరదిగ్బంధం సాగించి, వెంటనే జపానుతో సంధి చేసుకుని, జపానువారికి ఆయుధాలిచ్చి వారిని యుద్ధంలోకి దింపాలన్నాడు!

మరొక డెమొక్రాటిక్ సెనెటర్ ఇదే ధోరణిలో మాట్లాడుతూ, చైనాజాతీయవాదులను యుద్ధంలోకి తీసుకోమనీ- అవసరమైతే కమ్యూనిస్టుచైనామీద అణువు

# మన దేశం

(4-వ పేజీ తరువాయి)

రేషనింగు విఫలమయినట్లు శాసనసభ్యులు చాలామంది ఒప్పుకున్నారుగాని అందులో రాష్ట్రప్రభుత్వం సంతోషించవలసింది ఏమీ లేదు. ప్రభుత్వం అసమర్థతే దానికి కారణమని చాలామంది అన్నారు.

అసలు అన్నిరకాల రేషనింగూ ఎత్తివేస్తే అన్ని బాధలూ విరగడైపోతాయన్న భావంకూడా చాలామంది కున్నది. దీనికి కారణంకూడా ఆహారవిషయంలో ప్రభుత్వం చేసిన అకతవకలే. ధాన్యసేకరణ విషయంలోనూ, రేషన్లు అందించటం విషయంలోనూ ప్రభుత్వంపద్ధతి, "అవ్వ పెట్టా పెట్టదు, అడుక్కు తిననివ్వదు," అన్నట్టయింది.

## కొత్త పద్ధతి

ఇప్పుడు రాష్ట్రప్రభుత్వం అవలంబించనున్న విధానం పూర్తిగా బేపూచీ విధానం. ప్రభుత్వ అంచనాల ప్రకారం - ఈ అంచనాలలో ప్రభుత్వానికి తప్ప మరెవ్వరికీ విశ్వాసం ఉన్నట్టు కనబడదు - మిగులు జిల్లాలనుండి మిగులులో కొంతభాగంమాత్రమే సేకరిస్తారు. మిగిలినది జిల్లాలమధ్య వ్యాపారం నడవటానికి వదులుతారు. తరుగుజిల్లాల నుండి ధాన్యం సేకరించరు. నగరాలలో మాత్రం రేషనింగు ఉంచి గ్రామాల్లో ఎత్తేస్తారు.

దీని ఫలితంగా జరిగే దేమిటంటే, అనంతకోటి గ్రామప్రజలు ఆహారంకోసం ఇదివరకులాగా ప్రభుత్వంపై ఆధారపడటం మాని ఇకముందు 'ధనికభూస్వాములపై ఆధారపడవలసివస్తుంది. ఏ వర్గం నుంచి ప్రజలను రక్షించటానికి రేషనింగు విధానం ఏర్పాటయిందో ఆ వర్గం పూర్తిగా విజృంభిస్తుంది. ఈ వర్గం ఇదివరకే విజృంభించలేదా అనవచ్చు. ప్రభుత్వం అవలంబించిన ఆహారవిధానంలో లోపం ఉన్నంతమేరకు విజృంభిస్తూనేఉన్నది. ఇప్పుడా కాస్త అంకుశముకూడా తొలగిపోతుందన్నమాట.

## మహతాబ్ చెప్పిన మాట

నాసిక కాంగ్రెసు అయిన తరవాత కేంద్రపరిశ్రమల శాఖామంత్రి హరికృష్ణమహతాబ్ కంట్రోలువిధానాన్ని సమర్థించుతూ, ప్రజలు ప్రతీఅవసరానికీ ప్రభుత్వంమీద ఆధారపడేపద్ధతిలో కంట్రోళ్ల రద్దు అసంభవమనీ, గాంధీజీసిద్ధాంతాలప్రకారం ప్రతిగ్రామం స్వయంపోషకంగా ఉంటూ, ఏది లేకపోయినా గడుపుకుపోతూ ప్రభుత్వాన్ని తిండిగాని, బట్టగాని అడగనిపద్ధతిలో అయితే కంట్రోళ్లు ఎత్తివేయటానికి తనకు అభ్యంతరం లేదని అన్నాడు. అది సవ్యమైన దృక్పథం. ఆహారంవిషయంలో మద్రాసురాష్ట్రం అవలంబించదలుచుకున్న విధానం దీనికి పూర్తిగా వ్యతిరేకంగా ఉన్నది. కొన్ని నిలవలు ఉంచుతామనీ, క్లిష్టపరిస్థితి ఏర్పడితే ఆదుకుంటామనీ మద్రాసుఆహారమంత్రి అన్నమాట నిజమేగాని ప్రస్తుతం ఆయన జపించే పలాయనమంత్రం చూస్తే ఈ వాగ్దానాలు ఆశగొల్పవు.

## అంధకారంలో ఆశారేఖ

ఒక్క మన రాష్ట్రంలోనే కాక దేశమంతటా అతిక్లిష్టంగా ఉన్న ఆహారపరిస్థితివల్ల కలిగిన అంధకారంలో ఒక్క ఆశారేఖ ఏమంటే కేంద్రఆర్థికమంత్రి చింతామణి దేశముఖు మరో ఆరుమాసాలఅవతల మన దేశానికి రోజూ కొక ఆహారనౌక చేరేలాగు చూస్తాననీ, ప్రస్తుతం మన వాణిజ్యపరిస్థితి ఈ దిగుమతుల కనుకూలంగా ఉన్నదనీ అన్నాడు. ఇది నిజంగా శుభవార్తే.

ఏమంటే, కేంద్రప్రభుత్వం 1952 మార్చి తరువాత ఆహారదిగుమతులు పూర్తిగా నిలిపేస్తుందన్న వార్త చాలా సంక్షోభం కలిగించింది. ఒకవంక అధికాహారోత్పత్తి ప్రణాళికలు సరిగా పనిచేయలేదు. దేశం యొక్క ఆహారకొరత ఈ ప్రణాళికలు అమలుజరుగుతున్న కొద్దీ పెరుగుతున్నది. ఈ యేడు 40 లక్షల టన్నులకొరత అయితే వచ్చేయేడు 60 లక్షలటన్నులకు పెరుగుతున్నది. క్రమంగా కంట్రోళ్లు ఎత్తివేసేపైనం కూడా కాగితంమీదే ఉండిపోయిందిగాని ఆచరణలో మృగ్యమయింది. ఆహారవిషయంలో ప్రభుత్వం అవలంబిస్తూవచ్చిన విధానంలో కలిగిన మార్పులు, పరిస్థితి క్రమంగా బాగుపడుతున్నట్టు సూచించటం లేదు. మొదటినుంచీ కూడా కనిపించేది, ప్రభుత్వం తప్పులుచేసి దిద్దుకోవటమూ, ప్రణాళికలు వేసి అమలు జరుపలేకపోవటమూ, వ్యక్తులను మార్చటమూ, "సర్క్యుసు"లు సాగించటమూ, దీర్ఘప్రణాళికలకు- ప్రాజెక్టులు మొదలైనవాటికి- డబ్బు సాధించలేకపోవటమూ, సమస్యలనుండి పారిపోవటమూ మాత్రమే ఒక కంట్రోలు ఎత్తివేసినా, ఒక కొత్త పథకం వేసినా దాని వెనక ప్రభుత్వం అప్పటికి సాధించిఉన్న విజయం అంతో ఇంతో ఉండాలి. అది లేనప్పుడు ప్రభుత్వం తన విధానాన్ని ఎన్నిరకాల మార్చినా ప్రజలకు ఉత్సాహంగాని ఆశగాని కలగదు. మద్రాసు రాష్ట్రప్రభుత్వం గ్రామసీమల్లో కంట్రోలు ఎత్తివెయ్యటానికి నిర్ణయించిందంటే ఈ నిర్ణయానికి ముందుగాని వెనకగాని ప్రజలకు కనిపించేది పెద్ద పూర్ణానుస్వారమే అనాలి.

—రావు

బాంబులు వేయమనీ, రష్యా ఉపగ్రహరాజ్యం ఏది ఇకమీద దురాక్రమణ జరిపినా అమెరికాకు గల సర్వశక్తులనూ రష్యామీద ప్రయోగించి యుద్ధం ప్రకటించమనీ అన్నాడు.

రెండోపక్షంకూడా లేకపోలేదు. జేమ్స్‌వార్బర్గ్ అనే ధనికుడి నాయకత్వం కింద కొందరు న్యూయార్కు పౌరులు ట్రూమన్ వద్దకు పోయి, యుద్ధం నిలపవలసిందనీ, కొరియానుంచి విదేశబలాలను పంపివేయవలసిందనీ, చైనా ఫార్మోజాల ఆంతరంగిక వ్యవహారాలలో జోక్యం కలిగించుకోవటం మానవలసిందనీ అర్థించారు.

మొత్తంమీద అమెరికాయే అట్టుడికిపోతున్నది.

—రావు.





# త్రాసుపాము

గులపాడు వూగెలుపల గెడకర్రలకి మల్లే కిక్కిరిసి నిలబడుండ తాడితోపు మయాన నాగుమల్లె, సువ్వకి మల్లేపాం పుట్టల కాడ పాకుతుంటె బసవాయిని గొడ్లమందకాడ పేడకొచ్చిన ఎంకాయిదూరాన్నుంచి సూసుద్ది.

ఆ బసవాయి గిరజాలు అప్పుడే తెలుస్తాయి. అడిమెళ్లో ఎండికంటె పదామడ దూరాన్నుండా తెలుత్తానే వుంటది. గట్టిగా పంచ బిగట్టి నడుంకు ఆవ జానకట్టు బిగించేది వాడే. వాడి మెత్తాడుకు అయిదుగెజ్జలు, గెండునల్లకుచ్చులు ఎళ్లాడేది కూడా ఎంకాయికి బాగా తెల్చు.

అయితే యీడ కొకుండ ఎంకాయికి ఆడ పాంపుట్టలకాడ తచ్చాడ్తుండ బసవాయి అసలేంచేత్తుండదీ తెలవటం బహు కష్టం. అయినా ఎప్పుడుసూసినా ఏ ఎండ్రకాయ బొక్కల కాడో గెడ్డలు తీసుకుని నిలబడ్తావుంటేవోడు యియ్యాల వుండట్టుండి సాటుసాట్నాఆ పాంపుట్టలకాడ తిరగాల్నొచ్చిన పనేంది ? ఆడ జనం ఎవురూ లేరుగందా ? ఎంకాయి మదన్లోపడ్డది.

గొడ్డమంద గెనువుపెంట, నీలగుంటలకాడ ఆటిదార్ని అవి తల లొంచుకుని తిరుగావద్తుంటే మందపిల్లకాయలు బిల్లంగోడు ఆడుకుంటావుండారు. అటెటుసూసి తోపులోకి సల్లంగా జారబడ్డది పేడపళ్లికతో ఎంకాయి.

అంత పట్టపగలయినా తాడితోపులోకి ఎల్లేతలికి గలగలమంటా దగ్గిరదగ్గిరగా వాలేసుకుండ ఆ తాడిసెట్ల నీడలు బూవిమ్మీన పడి కరవొచ్చే జడల దెయ్యాలకి మల్లే వుంటంఅటుంచి ఏ బొక్కల్లోంచి ఎసువంటి జీవాలు తొంగిసూత్తావుంటయ్యో ఎసువంటి మడిసి కయినా తెలవటం బాహుకష్టం.

అడుగులు జారకుండా, చుట్టుపక్కల భద్రంగా సూసుకుంటా వొచ్చి బసవాయికి కాత్తపనకన నిలబడ్డది ఎంకాయి. ఆడ బసవాయి వాలకం, అసలు ఆడేంచేత్తుండదీ ముంగలయితే ఎంకాయికి అంతుబట్టలా. ఓ సేతిలో చెంచోళ్ల పాంకర్రా, రెండో సేతిలో గొబ్బిరిసిప్పా పట్టుకుని కోటయకొండ పెబకుమల్లేవుండ ఆ పుట్టపక్కన మోకాళ్లమీన వొంగి నిక్కి సూత్తుండ బసవాయిని చూసి కూసేపు అటనే నోరు దెరిసింది ఎంకాయి.

మెదులు ఎవురన్నా మాటల మయాన

(26-వ పేజీ చూడండి)

# తిలోత్తమ



"శ్రీ వపూర్"

సమస్తవిధ ప్రయత్నాలు, సర్వవిధాలయిన అంచనాలు చటుక్కున ఒక్క నిమిషంలో తల్లక్రిందులై పోయే నాటక సంఘటనలలాంటి ఘట్టాలు ప్రతిఒక్కరి జీవితంలోనూ మధ్యమధ్య వస్తూనే ఉంటాయి. ఉత్తరముఖంగా ప్రవహించే ప్రవాహం చటుక్కున దక్షిణముఖంగా తిరగవచ్చు. ఎత్తుగాకన్పించే పర్వతశిఖరం హఠాత్తుగా పెద్దకందరంలాగామారిపోవచ్చు. మానవజీవితంలో తరచుజరిగేసంఘటం నలే ఇవి. ఇలాంటివాటికో సమని రాముడురా వణుడు గా మారి వందువల్ల లాభం లేదు.

నకుల్ నంది సాధారణ మానవుడు. అతడి కొడుకు గోకుల్ నంది అయినా అసాధారణుడేమీ కాడు. అతడూ అందరిలాగా నే.బి.ఏ. ప్యాసయి, అయినవాళ్లతో, కానివాళ్ళతో కలిసి, చీట్లాడుతూ, నాటకాల్లో వేషాలు వేస్తూ, సాహిత్య చర్చలతో, రాచకీయాలతో బుర్ర చెడగొట్టుకుంటూ కాలక్షేపంచేస్తున్నాడు. అందరికీ వచ్చినట్లే అతడికీ సంబంధాలు వస్తున్నాయి. ఈ 'సంబంధాల మార్కెట్'లో గోకుల్ మంచి ఖరీదయిన వరుడు. పట్నంలో మూడంతస్తుల మేడ ఉంది. తండ్రికి వడ్డీ వ్యాపారం ఉంది. అంచేత అతనేనాడూ ఉద్యోగంమీద ఆధారపడి ఉండాల్సిన అగత్యంలేదు. భగవంతుడు అతడికి ఇచ్చినదాంతో జీవితమంతా కులాసాగా నాటకాల్లో వేషాలు వేస్తూ, నాట్యకళను అభివృద్ధిలోకి తీసుకుని రాగలడు. అతడికి సంబంధాలు చాలా వస్తున్నాయి. తండ్రి నకుల్ నంది మాంచి వ్యవహారజ్ఞానం ఉన్నమనిషి. కట్నం, సంప్రదాయం, అందచందాలు, ఇలాంటివన్నీ అన్నివిధాలా ఆలోచించి చివరికి తాను ఇంటికి కోడలుగా తెచ్చుకోవాలనుకున్న చిన్నదాని ముద్దుపేరు తిలూ- పూర్తిపేరు తిలోత్తమ. నకుల్ నంది ఈ కాలపు మనిషి కాడు. అంచేతనే కొడుకును పంపకుండా తానే వెళ్ళిచూసి పిల్లను పసందుచేసుకుని వచ్చాడు. ఆ పిల్లపేరు విని గోకుల్ ముగ్ధుడైనాడు. ఆపేరునుబట్టి అతడు మనస్సులో ఊహించుకున్న చిత్తరువుముందు కావ్యనాయిక తిలోత్తమ ఎందుకూ పనికిరాదు.

... ... ...

తీరా పెళ్ళిపీటలమీద తిలోత్తమను చూసి గోకుల్ తెల్లబోయాడు. తిలోత్తమే నిజానికి. నువ్వుగింజ రంగులాగా నల్లటి ముఖమూ, చింతాకంతేసి కళ్లు. సానాయి ధ్వనులూ, శంఖధ్వనులూ, కోలాహల ధ్వనులూ వీటన్నిటిమధ్య ఆమెనే పాణిగ్రహణం చేసుకున్నాడతడు. గత్యంతరం లేకపోయింది. చాలా కళవళపడ్డాడు.

తండ్రి నకుల్ నంది కూడా విస్తుపోయాడు. వియ్యంకుడు ఎంత సరసుడు, సరళుడు అని అతననుకున్నాడో అలాంటి వాడు కాడని ఇప్పుడు తెలుసుకున్నాడు. అతడు ప్రతీదాంట్లోనూ చేతులు నలుపుకుంటూ 'కానిస్తూ ఉండండి' అని అంటూ జరుపుకుంటూవచ్చాడు. చేసినవాగ్దానాల్లో ఒక్కటయినా చెల్లించుకోలేదు. అసలు కట్నంలోనే అయిదువందలు బకాయి పెట్టాడు. అనుకున్న ప్రకారం పైకం

అంతా చేతికి అందలేదనీ, అందగానే ఆ బాకీ తీర్చుకుంటాననీ చెప్పాడు. వెలిసిపోయే చచ్చురకం పట్టుపంచెలు తీసుకువచ్చాడు. రిస్టువాచీ లేనేలేదు. కలకత్తా ఆర్డరయితే ఇచ్చారుట కాని ఇంకా రాలేదట. ఇచ్చిన ఉంగరం ఒకటే బంగారానిది అవునో కాదో పరమాత్మకి తెలియాలి. చూపులకుమాత్రం ఇత్తడి దానికన్న హీనంగా ఉంది. చివరకు ఇంతా చేసి తాను సంబంధం చేసుకున్నది దగుల్బాజీతోనా? నకుల్, ముందుగా ఏ ఏలాంఛనాలూ అవీ కోరుకున్నాడో వాటన్నిటికీ తిలోత్తమతండ్రి తలఊపుతూ, చేతులు నలుపుకుంటూ, చిత్తం చిత్తమని ఒప్పుకున్నాడు. నకుల్ అతిగానే కోరాడని చెప్పవచ్చు. కాని మరి ఆమాత్రమయినా రాబట్టటానికి వీలులేకపోతే ఇలాంటి అందవికారపు పిల్లను కోడలుగా ఎందుకు తెచ్చుకునేవాడు? దేనికయినా కొంత హద్దు అనేది ఉండాలి. కాని ఇదేంపని? అతి వినయంగా మాట్లాడిన అతడు చివరకు ఈతీరు చేస్తాడని ఎవరనుకుంటారు? పైగా నకుల్ ఇంట్లో కూడా నానాచీవాట్లూ తినాల్సివచ్చింది. గోకుల్ తల్లి తన మొగుడికి మతిపోయిందని బిగ్గరగానే సాధించటం మొదలుపెట్టింది. కొంచెం జ్ఞానం ఉన్నవాళ్ళెవరైనా తన కొడుక్కి అలాంటి పిల్లను చేసుకుంటారా? ఛీ. ఛీ. నకుల్ అబద్ధం చెప్పి తప్పించుకోవటం మొదలెట్టాడు. "ఈ అమ్మాయిని కాదు నాకు చూపించింది. నాకు చూపించినపిల్ల, మిలమిల మెరిసే ఒళ్లు, ఒత్తయిన తలకట్టు. చక్కటి కనుముక్కు తీరుతో కళకళలాడుతూ ఉండేది. వీళ్లెక్కడో దొంగలూ, దగుల్బాజీలు, మోసగాళ్లులా ఉన్నారు. నా కొడుక్కి నేను మళ్లీ పెళ్ళిచేస్తాను" అని ఎగరటం మొదలెట్టాడు. అతడి మాటలకు అంతా వత్తాసు ఇచ్చారు. అలా యిచ్చిన వారిలో గోకుల్ కూడా ఒకడు.

తిలోత్తమతో మాట్లాడకేం! ఆమె చాలా మంచిది అన్న సంగతి గోకుల్ ఒప్పుకోకుండా ఉండలేకపోయాడు. ఆమెముఖంలో మంచితనం అచ్చొత్తినట్లు స్పష్టంగా కన్పించేది. ఆ మంచితనానికి తోడు అపరిమితమైన సిగ్గు. ఎంతో బ్రతిమాలి ఎలాగయితే యేం గోకుల్, ఆమెతో మాట్లాడగలిగాడు. మాట్లాడి మరీ ఆశ్చర్యపోయాడు. అందరూ కలిసి ఆమెతండ్రిని అన్ని తిట్లు తిట్టినా, ఆమె ముఖమయినా చిట్లించుకోలేదు. ప్రొద్దున్నే సూర్యోదయమైనా, వర్షాకాలంలో వర్షం కురిసినా ఎలా ఆశ్చర్యపోరో అలాగే దీనికీ ఆశ్చర్యపోలేదు. పెళ్ళిళ్లలో ఇలాంటివి జరగటం సహజమేగా! వీటిల్లో విచారించటానికీ, విస్తుపోవటానికీ ఏముందీ!

నకుల్‌నంది తిలోత్తమ విషయంలో ఏ అబద్ధాలయితే ఆరోపించాడో, తలుచుకుంటే వాటినన్నిటినీ ఆమె ఖండించగలదు. కాని ఆమె ఆపని చెయ్యలేదు. సంకోచంతో మెదలకుండా ఊరుకుంది. గోకుల్‌ను భర్తగా పొందకలగటంవల్ల తాను కృతార్థురాలినయినా ననుకుంది. అనవసరంగా వాద వివాదాలు పెంచుకోవటంవల్ల లాభంఏముంది? గోకుల్‌కు తాను తగినదాన్ని కాననీ, కాకపోయినా అదృష్టబలిమివల్ల స్వర్గంలో ప్రవేశించానని ఆమె అనుక్షణమూ అనుకునేది. కలహాన్ని రేపెట్టి ఆ ఆనందలోకంలోనుంచి బైటకు వెళ్లకొట్టబడటం దేనికి?

"మా అమ్మా నాన్నా అన్నారు. నాకు మళ్లీ పెళ్ళిచేస్తారుట" అన్నాడు గోకుల్.

తిలోత్తమ మెదలకుండా ఊరుకుంది.

"సమాధానం చెప్పవేం?"

"మంచిదే. మన హిందువుల యిళ్లలో అలా జరగటం మామూలేగా!"

"నీకు కష్టం వెయ్యదూ?"

"నాకా? ఊహూఁ" అని కాస్సేపాగి, "ఒకవేళ కష్టమయినా మీరు సుఖపడ కలిగితే సహిస్తాను" అన్నది.

ఇది కేవలం అభిమానంకొద్దీ అన్నమాట అనుకున్నాడు గోకుల్. ఇంకేమీ మాట్లాడలేదు.

ఒక ఏడాది గడిచింది.

తిలోత్తమమీద మోహంలోనుంచి బైటపడటానికి ఆ వ్యవధిచాలు. ఆమెకు చదువు రాదు, సంగీతం రాదు. హావభావాలు అంతకన్న తెలియవు. అందచందాలూ లేవు. ఆకర్షించే గుణగణాలూ లేవు. ఆమెలో ఉన్నదల్లా దున్నపోతులా చాకిరీ చెయ్యకలిగిన గుణంఒక్కటే. ఎన్ని అంట్లుఅయినా తోముతుంది. ఎన్ని గుడ్డలయినాసరే ఉతుకుతుంది. విసుక్కోదు. కసురుకోదు. ముఖంచిట్లించుకోదు. అత్తగారు ఆమెను వంటయింట్లోకి రానిచ్చేదికాదు. అయినా బైటపనులతోనే ఎప్పుడూ మునిగితేలుతూ ఉండేది. ఆకాశంలో చందమామ ఎంత పైకి వచ్చాడో, పొగడచెట్టుమీద పపియాపిట్ట కూసిందో లేదో, మామిడిగున్నమీదకు కోయిల వచ్చిందోలేదో ఇలాంటివన్నీ కనిపెట్టి చూస్తూఉండటం ఆమెకు సాధ్యంకాని పనులు.

కవితాహృదయం, నటప్రవృత్తీ కల గోకుల్ కొన్నాళ్లు ఓపికపట్టి ఊరుకున్నాడు. చివరకు ఆమెతో లాభంలేదని ఆశ వదులుకున్నాడు. ఒక దాసీదాన్ని ఎన్నాళ్లని ప్రేమిస్తూ ఉండగలడు!

నకుల్ ఇప్పటికీ ఇంకా వియ్యంకుడంటే మండిపడుతూనే ఉన్నాడు. కాని రెండో పెళ్ళిసంగతి ఎత్తటంమాత్రం మానేశాడు. గోకుల్ తండ్రిదగ్గర నోరెత్తి మాట్లాడటం అనేది చాలా కష్టమైన విషయం. ఈ పరిస్థితుల్లో విధాత ఒకనాడు తలయెత్తి చూశాడు.

చంద్రగుప్తనాటకం వెయ్యాల్సి వచ్చింది. సెల్యూకస్, ఆంటిగోనాస్ వేషాలు వేసేందుకు వ్యక్తులు దొరికారు. కాని వాళ్లకు అనువైన దుస్తులు దొరికేట్లు కనపడలేదు. గ్రీక్‌దుస్తులు తీసుకుని వద్దామని గోకుల్ కలకత్తా ప్రయాణమైనాడు. స్టేషనుకు వెళ్ళి టిక్కెట్ తీసుకుంటూ– ఆ గుంపులో ఒక ప్రౌఢ వితంతువు కిటికీ దగ్గరకు త్రోసుకునిరాలేక అవస్థపడుతూ ఉండటం– చూశాడు. జారిపోతున్న మాటను అదిమి పట్టుకుని ఆమె ముందుకు వస్తుంటే చుట్టూ ఉన్న జనం ఆమెను వెనక్కి త్రోసిపారేస్తున్నారు. గోకుల్ ఆమెకు సహాయపడ్డాడు. టిక్కెట్ కొని ఇచ్చాడు. ఆమె కూడా కలకత్తాయే వస్తోంది. వెంట మగదక్షత ఎవరూలేరు. కనుక ఆ బాధ్యతకూడా గోకులే నిర్వహించాల్సి వచ్చింది. గోకుల్ ఎక్కిన పెట్టెలోనే ఆమెకూడా ఎక్కింది. తనకు కూర్చోటానికి తగినంత జాగాలేకపోయినా గోకుల్ మరో ప్రయాణికునితో దెబ్బలాడి ఆమెకు పడుకోటానికి తగినంత స్థలం ఇప్పించాడు.

ఆ ప్రౌఢ ముగ్ధురాలయింది.

ఆ పెట్టె క్రమశః ఖాళీ అయిపోసాగింది. ఆమె తన మూటలోంచి పాన్‌దాన్ తీసి రెండాకులు అతడికి ఇచ్చి తాను రెండు ఆకులు వేసుకుని "నాకీ రాత వచ్చాక ఒకొక్కటే అన్నిటినీ విడిచిపెట్టాను. కాని ఈ తాంబూలం అలవాటుమాత్రం విడిచిపెట్టలేకపోయాను బాబూ!" అన్నది నవ్వుతూ.

కిటికీలోంచి బైటికి వంగి ఒకసారి ఉమ్మివేసింది.

ఇంక సంభాషణ ప్రారంభమయింది.

చాలాసేపు జరిగింది సంభాషణ. ఆ సంభాషణ ఫలితంగా ఆ ప్రౌఢ గోకుల్ కులగోత్రాలూ, నాడీనక్షత్రాలూ తెలుసుకోగలిగింది. గోకుల్ కూడా దాపరికం లేకుండా అన్ని సంగతులూ చెప్పేశాడు. ఏమీ దాచలేదు, దాచలేకపోయాడు.

దాచటం మంచిదేమో అన్న అభిప్రాయం కూడా అతడికి కలగలేదు. అంటే గోకుల్ కూడా ముగ్ధుడైనా డన్నమాట! అన్నీ విని, "నువ్వు మళ్లీ పెళ్ళిచేసుకుంటా నంటున్నావు కదా! సంబంధం ఎక్కడయినా కుదిరిందా?" అని అడిగింది.

"ఇంకా లేదు"

ఆమె మరో రెండాకులూ, వక్కపలుకూ బుగ్గను పెట్టుకుని, "చూడు.

*　　*　　*

"బాబూ! నేనూ అన్నిసంగతులూ దాపరికం లేకుండానే చెబుతున్నా. నాకో కూతురు ఉంది. అది పుట్టాకనే నాకీ రాత వచ్చింది. మనస్సుకు నచ్చిన వరుడికోసమని నేనూ వెతుకుతున్నాను. నువ్వు ఎంతో నచ్చావు నాకు. మా అమ్మాయి అందవికారపు పిల్లేమీ కాదు. కనక మరి నువ్వు ఊఁ అనేట్లయితే-"

గోకుల్ ఈసంగతి మొదట్లో ఊహించుకోలేదు అసలు. అంచేత వెంటనే సమాధానం ఏమీ చెప్పలేకపోయాడు.

"ముందు ఉషను చూడుబాబూ, నువ్వు! నీకు కనక నచ్చితే-"

"నాకు ఒకభార్య బ్రతికే ఉన్నదని తెలిశాకనైనా బహుశా మీ అమ్మాయికి అభ్యంతరం కలగవచ్చునేమో." అన్నాడు గోకుల్ నీళ్లు నములుతూ.

"నామాటకు ఎదురు చెబుతుందా ఉష! అది అలాంటిపిల్ల కాదు. దానికి చదువూ, సంగీతం అన్నీ నేర్పించాను. కాని, దాన్ని ఈకాలపు పిల్లలలాగా- చెప్పిన మాట విననిదానిలా తయారుచెయ్యలేదు. మరో భార్య ఉన్నదికదా అంటావా! మళ్లీ పెళ్ళిచేసుకున్నాక ఆమెను ఎటూ విడిచిపెట్టాలని అనుకున్నావుగా? ఆఁ ఏమంటావ్?"

"ఆఁ. ఆఁ. నిజమే."

"అలాంటప్పుడు ఇక ఆవిడ ఉంటే ఎంత? లేకపోతే ఎంత! ఏమంటావ్?"

"ఆఁ. అవును. అది నిజమే."

...　　...　　...

ఉష ఉష కాదు- మిట్టమధ్యాహ్నం అని చెప్పవచ్చు. మెరుగుపెట్టిన మేలిమి బంగారం కాంతిలాగా ఆమె శరీరకాంతి మెరిసిపోతూఉంటుంది. ఆమె ముఖంలో, కళ్లల్లో, నవ్వులో, నడకలో, చూపులో ఏదో విద్యుత్కాంతి ప్రసరిస్తున్నట్లుంటుంది. సితారుమీద సారంగరాగం ఎవ్వరూ అంత చక్కగా వాయించగా అతడెప్పుడూ వినలేదు. ఆ చిరునవ్వుమాటున ఆమెకు ఉన్న స్వరజ్ఞానం అమోఘం.

గోకుల్ మురిసిపోయాడు.

...　　...　　...

ఒకనెలలో అనుకున్న ఏర్పాట్లన్నీ జరిగిపోయాయి. ఆ ప్రౌఢ ఉషను వెంటపెట్టుకుని వచ్చి గోకుల్‌గారి ఇంటిప్రక్కనే ఒకయిల్లు అద్దెకు తీసుకుంది. అతడి తల్లితండ్రులతో పెళ్ళి సంప్రతింపులు సాగించింది. ఉషను చూసి గోకుల్‌తల్లి మురిసిపోవటంకాదు, ఉబ్బితబ్బిబ్బు అవుతోంది. కట్నం అంకె చూసుకుని గోకుల్ తండ్రి పొంగిపోతున్నాడు. ఈ సంబంధం చేసుకుంటే పదివేలు రొఖ్ఖం, కావలసినన్ని లాంఛనాలు, కానుకలు ఒక చిన్న జమీ సంక్రమించే లక్షణాలు కన్పిస్తున్నాయి. అయితే ఉషతల్లినిగురించి చెడ్డపుకార్లు ఏవో ఉన్నాయిట! ఉషకు ఇంతవరకూ పెళ్ళికాకపోవటానికి అదే కారణంట! ఆ సంగతి తెలుసుకున్నాక కూడా నకుల్‌నంది నలుసంతయినా చలించలేదు. ఆతడా సంగతిని కేవలం ఉపేక్షించటంకాదు, ఎవరికయినా తెలిస్తే ఈ సంబంధం ఎక్కడ ఆగిపోతుందోనని ఇంట్లో కూడా ఎవ్వరికీ తెలియనీయలేదు. యౌవనదశలో ఇలాంటి తప్పటడుగులు ఒకటిరెండుసార్లు వెయ్యటం అందరికీ మామూలే. ఆ విషయాన్నే పట్టుకుని రాపాడించటం వల్ల ఏం లాభంలేదు. ఇదీ అతడి వాదం. వివాహంకాగానే తిలోత్తమను శాశ్వతంగా పుట్టినింటికి పంపివెయ్యాలని ఉష ఒక షరతు పెట్టింది. దానికి గోకుల్, గోకుల్‌తండ్రీ, తల్లీ అందరూ ఒప్పుకున్నారు.

...　　...　　...

రాత్రి పన్నెండవుతుంది.

గోకుల్ నిద్రపోలేదు. మంచంమీద మెలుకువతోనే పడుకునిఉన్నాడు. ఇహ తాంబూలాలు పుచ్చుకునేది రేపే. ఏదీ తిలోత్తమ? ఇంకా గదిలోకి రానేలేదు. ఇంట్లో ఇంత మంత్రాంగం జరుగుతున్నా తిలోత్తమ ఒక్కమాటకూడా మాట్లాడలేదు. ఆమెను ఈ విషయం ఒకసారి అడిగిచూడటం విధాయకం. గోకుల్ మంచంమీద ఇటూ అటూ దొర్లుతున్నాడు. పనులన్నీ అయాక రాత్రి ఎంతో ప్రొద్దుపోయాక గదిలోకి వచ్చి మళ్ళీ తెల్లవారకమునుపే లేచి వెళ్ళటం తిలోత్తమకు అలవాటు. ఆమె కనిపించటమే కష్టం. గడిచిన పదిహేను ఇరవైరోజుల్లో గోకుల్ ఒక్కసారి కూడా ఆమెను ఏకాంతంగా కలుసుకోలేకపోయాడు. అసలు ఈ సంబంధం సంగతి ఆమెతో సంప్రతించనేలేదు. ఒకసారి సంప్రతించి చూడటం మంచిదికదూ? గోకుల్ ఆమెకోసం ఎదురు చూస్తున్నాడు.

హఠాత్తుగా గోకుల్‌కు మెలుకువ వచ్చింది. కళ్లు తెరిచి చూశాడు. తెలతెలవారుతోంది. తిలోత్తమ సంకోచంతో లేచి వెళ్లబోతోంది.

"ఇదుగో, విను. మాట"

"ఏమిటి?"

"ఇవాళే 'ప్రధానం' జ్ఞాపకం ఉందా?"

"ఉంది"

"చూడు, నీకేం అభ్యంతరం లేదుకదూ!"

(39-వ పేజీ చూడండి)

# చెల్లనినోటు

వెంకటేశ్వర్లు ఎందుకూ కొరగాకుండా పోతున్నాడు, అటు భార్యకీ ద్రోహం చేస్తున్నాడు, ఇటు అంతో ఇంతో వంశానికీ అప్రతిష్ఠని తెస్తున్నాడు. మధ్యన నల్పుకుపోయే ధనం నల్పుకుపోతూనే వున్నది; ఎటు తిరిగీ మనిషి చెడిపోతున్నాడు అని తెలుసుకొన్న వెంకట్రామయ్య ఒకరోజు అన్నాడు, తమ్ముడితో.

'ఏరా! ఇప్పుడు నువ్వే స్థితిలో వున్నావో తెల్సుకోగలుగుతున్నావా? కాస్తంత ఆస్తి వున్నదా లెక్క? నీపాటి ఆస్తి ఎంతమందికి లేదు ఈ దేశంలో! అది గాదు విషయం. ఆ ఆస్తిని తరగకుండా చూసుకోవటమే గొప్ప. అంతకు మించి నాశనం చేయటంలో పేరు ప్రతిష్ఠలు రావు. ఇప్పటి పరిస్థితుల్లో ప్రతి ఒక్క మనిషీ ఉన్నదాన్ని యేదో వేషంతో, దృక్పథంతో, మోసంతో రెండింతలు చేసుకోవటాన్నే ముఖ్యవిధిగా భావిస్తున్నాడు. దీన్ని బట్టిగూడా మనం స్వవిషయాల సమస్యల్ని ఒకళ్ల కళ్లల్లో పడకుండా చక్కబెట్టుకోవాలి.

'అదొకటున్నా, మన మేమన్నా ఈ వూళ్లో పేరు తెచ్చుకోలేము. ఉన్న పేరు ఎలానూ తండ్రిమూలంగా వుండనేవున్నది. దాన్ని కాస్త అష్టమైన పనులుచేసి చెడగొట్టుకోవటం దేనికి?

'ఇక పోతే ప్రస్తుత పరిస్థితుల్లో నిన్ను నువ్వు చదువుకో, అర్థం చేసుకో. ఊరినిండా బాకీలే. మూడు ఎక్రాలకి సరిపోనున్నవి. వాళ్లుమట్టుకు ఎన్నాళ్లిస్తారు అప్పు? పొలానికి సరిపోనిస్తారు; ఆ తరువాత నీ మొహం చూడరు. నీ అవసరాన్ని వాళ్ళు అవసరాలుగా భావించుకోలేరు. బ్రతుకు కాస్తా బజారుపాలు అవుతుంది. మనహయాములో మనం అగౌరవానికి గురవ్వటమే కాకుండా తండ్రికి చెడ్డపేరు తెచ్చినవాళ్ళం అవుతాము.

'నీ భార్య సంగతి చూడు, ఎలా అయిందో! అదంతా నీగురించి దిగులే, నీ గురించి ఆలోచనే. నిజానికి ఆమె ఈ రోజుల్లో వుండవలసింది కాకపోబట్టి నిన్ను అంటిపెట్టుకొనివుంది గాని, ఏ ఆడది వుంటుందిరా? నువ్వనే మాటలకూ, తిట్టుకూ-తన్నే తన్నులకూ! ఇంతకీ అది తన గీత మంచిది కాదనుకొనే తృప్తిపడుతున్నది. నీ కొక ఆడపిల్ల వున్నది. ఎనిమిదేళ్ళది. ఆడపిల్లల పెళ్ళి చేయటమే తేలని సమస్యగా పరిణమించిన ఈ రోజుల్లో, పిల్ల తండ్రివైన నువ్వు - ఇలా వక్రమార్గంలోపడి అందరిలో 'న్యూనత' గా వుంటే ఇంక దాన్ని పెళ్లాడటానికి ముందరకొచ్చే మొగాడెవడుంటాడు? పెళ్ళి ఎలా చేయగలుగుతావు?

రచన:

**'సులోచన'**

'నేను నిన్ను డబ్బు ఖర్చు చేసుకోవద్దనిగాదు చెప్పేది. ఆ ఖర్చయినా అవసరమైనవాటికే నలుగురికీ ఉపయుక్తంగా ఉండేనవసరం లేకపోయినా కుటుంబానికి పనికివొచ్చేదైతే సరి. భార్యను వొదిలి ముండలకి డబ్బు తగలబెట్టడం మంచిపని గాదు. నలుగురూ మెచ్చేది కాదు. కుటుంబం బాగుపడే లక్షణం కాదు.'

ఇటువంటి ఉపన్యాసాలు ఎవ్వరూ ఇంతవరకు వెంకటేశ్వర్లుకి చెప్పలేదని కాదు గాని, ఆ చెప్పినవాళ్లెవరూ ఇంత ఓర్పుగా, లాలనగా చెప్పలేదు. అయినా అది అనవసరం. ఈ ఉపన్యాసంలోని అంతర్యాన్ని గ్రహించుకొని వక్రమార్గంలోంచి సక్రమమార్గంలోకి అమాంతంగా రాగల శక్తిసామర్థ్యాలు ఇంకా వెంకటేశ్వర్లుకి కలగలేదు గనుక.

వంచిన తల ఎత్తకుండా కూచున్నాడు వెంకటేశ్వర్లు. ఎవరన్నా తనని గురించి, తనక్షేమంగురించి నీతులు చెబుతూంటే 'ఆ చెప్పేది తనకు కాదు' అని అనుకోవటమే, వదలకుండా కూర్చోవటమే వెంకటేశ్వర్లలోని పెద్ద లోపం. ఆయన్ని తెలియనివాళ్లయితే, ఆయన మనస్తత్వానికి అలవాటుపడనివాళ్లయితే, మౌనం అంగీకారసూచకమే! మంచిదోవకు రావొచ్చు' అని భ్రమపడతారు. కాని అది గాదుగా అసలు సంగతి.

లేచి వెళుతూ అన్నాడు, వెంకట్రామయ్య.

'ఇదంతా నాకోసం కాదు. నీవు బాగుపడగలందులకే. కుటుంబంలో కలతలు లేకుండాపోగలందులకే. ఇక, 'నాయిష్టం నాది. నీళ్లల్లో మునుగుతాను, పాలల్లోమునుగుతాను. నువ్వెవరవు చెప్పటానికి' అనే గనుక అంటే, నే చెప్పేదేమీ వుండబోదు. ఇంకా నే చెప్పితే ఆలకిస్తావనే ఆశతోనే చెబుతున్నా. అనవసరపు విలాసాలకు డబ్బును వ్యయపర్చటం జీవితానికి మంచి దెబ్బ!'

వెంకటేశ్వర్లు మాట్లాడలేదు.

ఇది జరిగిన నాలుగోరోజు వెంకటేశ్వర్లు భార్యావొచ్చింది, వెంకట్రామయ్యదగ్గరకు. అప్పుడే అన్నం తిని చుట్ట చుట్టుకుంటున్నాడు.

'ఏమిటే విశేషాలు?' అన్నట్టుచూశాడు.

'ఏమున్నవండి? మీ తమ్ముడుగారికి బాగా గట్టిగా చెప్పండి,' అని నసిగింది.

'చెబుతూనేవున్నాను. చెవినిపెట్టండే! మనమేం చేస్తాం?' ఇక అలాంటప్పుడు తనవల్ల ఎలాగవుతుందనే అర్థం వొచ్చేట్టు అన్నాడు వెంకట్రామయ్య.

'నిన్న నేం జరిగిందో చూశారా?' అన్నది వెంకటేశ్వర్ల భార్య.

'ఏం జరిగిందేమిటి?' అన్నాడు వెంకట్రామయ్య, సగం అసంతృప్తితోనే.

'మీ తమ్ముడుగారు బజార్నుంచి వొస్తున్నారట. ఎవడో అడ్డంమాలిన వెధవ నిలేసి, బూతులవర్షం కురిపించాడట. ఈయనగారు అదిరిపోయి నిలుచున్నారట.'

ఈ విషయం ఎవ్వరూ అనుకున్నట్టు వెంకట్రామయకు తెలీనేలేదు. ఆ రోజుకు పదహారు గంటలు బజార్లో తిరిగేమనిషి కాకపోవటంతో తెలీక పోవచ్చు.

'ఎందుకు తిట్టాడు, వాడు?'

'ఎందు కేమిటి? తరువాత తెలిసింది. వాడు దొమ్మరివాడట. ఈయనగారు ఇదివరకట్నుంచి డబ్బులిచ్చి మేపుతున్నారట. ఇప్పుడు యివ్వడం మానేశారుట. వాడిఅప్పు ఈయనగారి ముండట.'

ఇదంతా చెబుతూనే పాపం వెంక

వేంకటేశ్వర్లుభార్య కళ్లనీళ్లు పెట్టుకొంది.

వెంకట్రామయ్యకు ఏమనటానికి తోచలేదు. 'నే చెప్పిచూస్తానులే. నువ్వేమీ విసుగుపడకు' అనేసి వూరుకున్నాడు.

వెంకటేశ్వర్లు భార్య వెళ్ళిపోయింది.

ఆమె భర్తనుగురించి ఎంతో ఇదవుతున్నది. డబ్బు ఖర్చుపెట్టేవిషయంలో ఆమెకు కష్టపడాల్సిన అవసరంలేదు. రోజూ యింటిదగ్గరుండి, సంసారాన్ని చక్కబెట్టుకొని-నలుగురు పెద్దమనుష్యుల్లో తిరగటమే ఆమెకు కావాల్సింది.

పెళ్లిగాకముందు రాబోయే భర్తనుగురించి అందరి యువతులకుమల్లే ఆమెగూడా కలలుకంటే కనొచ్చు. తన జీవితం తేనెసోనగా నడిచిపోతుందని భావిస్తే భావించొచ్చు. తన భర్త తననే ప్రేమదేవతగానూ, తన పిల్లలనే లోకంగానూ చూసుకుంటాడు ప్రేమను వొలకబోస్తూ ఎప్పుడూ తనని అంటిపెట్టుకొని వుంటాడు. అని గూడా అనుకొనివుంటే వుండొచ్చు, కాని ఇలాగే జరుగుతుందని, జరగాలి - లేకపోతే ఆ భర్తను పొందను అని ఆమె ఆశయం కాకపోవచ్చు.

పోతే, తన జీవితం ఇంత అధ్వాన్నం అవుతుందని ఆమె ఎన్నడూ ఊహించలేదని పై భావాల్నిపట్టి తేలుతున్నది. అయినా మనం ఆశ్చర్యపడవలసిన విషయమేమిటంటే, ఇప్పుడామె కోరేది పూర్వపు ఔన్నత్యాన్ని కాదు. పూర్వం తాను కన్న కలలూ,భావించిన భావాలు, నిజాలు గావాలనీ కాదు - తనభర్త చెడు తిరుగుళ్లు తిరగకుండావుంటే సరి. చివరకు తను అక్కర్లేకపోయినా అలాగన్నా కాలేదే, కావటం లేదే. అనే ఇప్పుడు వెంకటేశ్వర్లు భార్య యేడ్చేది, దుఃఖించేది.

భర్త చెడుతిరుగుళ్లు తిరిగి చెడిపోతూంటే భార్యకు దూరమవుతూంటే, ఆ భార్య యేడుస్తుంది. ఈ సమాజంలో, వంశ గౌరవాన్నీ, కుటుంబనైసర్గికాన్నీ నిలబెట్టమంటుంది. కాని, ఆ భర్త వినడు; చెవిని పెట్టడు; చెడు తిరుగుళ్ళలోని మధురత్వానికి అలవాటుపడ్డ ఏ భర్తా, భార్యమాట ఆలకించడు. అది ముఖ్యంగా కనబడదు. ఏడుస్తుంది. కాని వినడు. పైగా కొట్టడంగూడా జరిగితే జరగొచ్చు. కొంచెం సంస్కారం జీర్ణించిన భార్యయితే 'నే నుండను, నా సుఖం నాది' అని బెదిరిస్తుంది. ఈ బెదిరింపుల్ని భర్తకి బెదిరింపులుగానే కనబడి హేళనలోకి దించుతాయి. బెదిరించినంత మాత్రాన లేచిపోరని తెలుసు. అయితే అతనిలో ఒక గట్టి నమ్మకం అసాదించి పనిచేస్తూ, ఇప్పుడు గట్టిపడితే పడొచ్చు. 'భార్య భర్తప్రవర్తనాన్ని సహించలేక లేచిపోతే ఆ భార్యని సంఘం మెచ్చదు' అనే నమ్మకం.

వెంకటేశ్వర్లుకి ఈ నమ్మకమే వుందనుకోడం సబబుగాదు.

ఏ మనిషిలోనన్నా గానీయండి, వ్యక్తిత్వం నశించిందంటే వెనుక బలమైన కారణాలుండక తప్పదు. ఆ కారణాలే వెంకటేశ్వర్లులో వ్యక్తిత్వం నశించటానికి సహాయమయ్యాయి. తండ్రి చనిపోతూ యిచ్చినదాంట్లో పంచుకొన్నది వెంకట్రామయ్యా, వెంకటేశ్వర్లే అయినా ముందూ వెనకా ఎవరూ లేకపోబట్టే నాలుగెకరాలువచ్చినవి. కేవలం ఈనాలుగెకరాలతోనే జీవనం అయితే వెంకటేశ్వర్ల మిడిసిపాటుకు చాలివుండేది కాదు. ఎవడో ఒక ముసలాడు, పది సంవత్సరాలకు చావవలసినవాడు రెండుసంవత్సరాలకే చావటంమూలాన, అదనంగా పది ఎకరాలు వచ్చినవి. ఆ రావటమే వెంకటేశ్వర్లుని ఈ స్థితిలోకి తెచ్చింది. పైగా అత్తగారు నాలుగెకరాల కట్నం, రెండువేల డబ్బు - ఇచ్చారు.

'అదృష్టంకారణంగా అమాంతంగా డబ్బు వొచ్చిందంటే, దాన్ని దాచుకోగలిగినవాడే ఘనుడు. అలా దాచుకోగలిగినవాడు చాలామంది వ్యక్తులు కనబరచే 'అనూయ'కు గురైనా ఫరవాలేదు అది ఎల్లకాలమూ నిలిచేదిగాదు. డబ్బుండగానే ఊళ్లో తాశీలు కట్టే పనిలేనివాళ్లూ,పొలాన మాగాలుచేసే పనిలేనివాళ్లూ చాలామంది చేరతారు. వాళ్లనికాదని పోవటమే మన పని.'అరచేతిలో స్వర్గం చూపిసారు. దానికి అలవాటుపడకండా వుండటమే తెలివైన పని అని అన్నాడు వెంకట్రామయ్య మొదట్లో, వెంకటేశ్వర్లుకి ఆస్తి వొచ్చినప్పుడే'

ఆ మాటలు అక్కరకు రాలేదని ఇప్పటికీ విచారిస్తూనే వుంటాడు వెంకట్రామయ్య.

## 2

'నన్ను కొట్టండి, చంపండి - నరకండి! ఏమన్నా చేయండి, ఈ విషయంలో మీ మాట నేను వినను. మీరు కుటుంబాన్ని నాశనం చేశారు. చేయబోతున్నారు. ఇప్పటికే వూళ్లో ఎంతమంది నోళ్ళల్లోనో మన చరిత్ర తిరుగుతున్నది! ఎంత అప్రదిష్ఠ? నిక్షేపంలాంటి పొలాన్నంతా మీ తిరుగుళ్లకూ, విలాసాలకూ వ్యయం చేశారు? ఎన్నడైనా ఆలోచించారా? 'ఇదంతా ఖర్చుపెడుతున్నాను? ఎందుకు? ఎవరి సౌఖ్యంకొరకు? తక్కిన వాళ్లు ఏమవుతారు?' అని? పోనీ. ఆ ఆలోచనమీకు రాకపోతే, నేను చెప్పలేదా? మీ అన్నగారు చెప్పలేదా? పిల్లలకు చెప్పి, బోధచేశామే! కాని మీరు చెవిని పెట్టారా?'

వెంకటేశ్వర్లు భార్య అంటున్నది, వెంకటేశ్వర్లతో.

'ఛట్! ఈ వేదాంతమంతా నాకక్కర్లేదు చెప్పు! ఏదో ఒకాటి తేల్చు, లేకపోతే చంపేస్తాను, నాకోపం అటువంటిది!' వెంకటేశ్వర్లు అరుస్తున్నాడు.

'ఆపైన ఏమైనా చేయండి!' వెంకటేశ్వర్లుభార్య గట్టిగా అంటున్నది 'దీంట్లో నేను సౌఖ్యపడేది ఏమీ లేదు. పదమూడేళ్ల పిల్ల వున్నది. రేపు పెళ్లి చేయాలి? ఎవడు పెళ్లాడటానికి ముందంజవేస్తాడు? ఆస్తి లేకపోతే? కట్నం ఇవ్వకపోతే? మీపాలం ఎలాగూ నాశనం చేశారు! నన్ను కొట్టి, తిట్టి, బెదిరించి ఇంట్లో వున్న మూడువేల రూపాయల నగలూ ఉంపుడుగత్తెల పాలుచేశారు. ఇంకా అంతటితో తృప్తిపొందక నాపేర వున్న పొలం అమ్మి డబ్బు వొప్పజెప్పమంటున్నారు. ఇది జరగదు. నేను బ్రతికి వుండగా ఆపని చేయను, చేయలేను. పిల్ల గొంతు కోయలేను.'

'ఇదంతా నీ సొంత వుపన్యాసమేనా? మా అన్నయ్య నూరిపోసిందా?' వెంకటేశ్వర్లకు అనుమానం.

స్త్రీలకు స్వంతంగా ఆలోచించే శక్తి వుండదు వాళ్లు ఎప్పుడూ భర్తలమీద, వారి ఆశయాలమీద, అభిప్రాయాలమీద ఆధారపడి వుండవలిసిందే. భర్త ఎంతచెబితే అంత తప్ప మిగిలిన ప్రపంచం వాళ్ల కనవసరం. ఒకచెంపన భర్త తిరుగుబోతువాడై ఆస్తిని నాశనం చేస్తూంటే ఏడవటమే వాళ్ళపని - అనే అభిప్రాయాలుగల పురుషుల్లో వెంకటేశ్వర్లు ఒకడుకావడంమూలాన, తన భార్యకు స్వతహాగా ఇలా ధిక్కరించే బుద్ధి పుట్టదు, ఇక పోతే, తన అన్నయ్యే ఆ పని చేసివుంటాడు అనే అనుమానం బలంగా పాతుకుపోయింది.

'ఒకళ్లు చెప్పే దేమిటండీ, మన సంసారం! - మీ కేమన్నా ఇల్లు, డబ్బు, ఆస్తి, కుటుంబం, గౌరవం, ప్రతిష్ఠ - వీటి విలువలు తెలీకపోతూండె! ఒక ప్రక్కన భర్త ఎంగకూ పనికిరానివాడై పోతూంటె,

లోకంచాత నిందింపబడుతూంటే, ఏభార్య సహిస్తుందండి!'

వెంకటేశ్వర్ల భార్యకి రోషం వొచ్చింది.

'మీవల్ల నేనేం ఆనందం పొందలేదు. నా జీవితమేమీ మీ చేతుల్లో సుఖం పొందలేదు. ఎప్పుడూ మీ గురించీ, మీ తిరుగుళ్ళనుగురించీ దిగులే, మిమ్మల్ని సక్రమ మార్గంలోకి తేలేకపోతున్నాననే చింతే దాదాపు మీ అన్నయ్యగారికీ ఇదే! వెనక్కు తిరిగిచూడండి, అసలు మీకు ఆదిలో వున్నది ఎంత ఆస్తి? ఇప్పుడున్నది ఎంత ఆస్తి? ఇదంతా యేమయింది, ఇంత తొందరపాటుకు కారకు లెవరు? అని మీకు మీరుగా ప్రశ్నించుకు చూడండి, అప్పటికైనా గమనించుకోగలుగుతారేమో!

'పైగా నాపేరున వున్న ఆస్తి అమ్మి డబ్బుచేసి ఇవ్వమంటున్నారు; మీ విలాసాలకు ఆహుతిచేయడానికి. పిల్ల స్థితి ఆలోచించారా? అందులో మనపిల్ల రంభ కాదు, మేనక కాదు, అందాన్ని చూసి చేసుకోవడానికి. ఎంత కట్నం యిచ్చించితే వరుడు ముందుకు వస్తాడో ఊహించండి, ఈ రోజుల్లో! మన బ్రతుకు ఎలానూ ఇలా తెల్లవారుతూనే వున్నది. దానన్నా కొస్త మంచివాడికిచ్చి సుఖపెట్టితే, అదన్నా బాగుపడుతుంది.'

ఏమనుకున్నాడో యేమో వెంకటేశ్వర్లు చరచరా బజారు కెళ్లాడు. దిగులుపడి నిలుచుని చూస్తున్నది, వెంకటేశ్వర్ల భార్య.

మధ్యతరగతి కుటుంబాల్లోని చెడుని సంఘం త్వరగా ఆకర్షిస్తుంది. ఒక వ్యక్తి వల్ల, ఆ వ్యక్తి మనస్తత్వంవల్ల, ప్రవర్తన వల్ల ఒక కుటుంబం మలినమైతే - ఆ మలినాన్ని అందరూ కొంపంతలుగా చెప్పుకొని నీతితో, ధర్మంతో కొలుచుకొని, ఆ కొలత బద్దల ప్రమాణంతో - ఆ కుటుంబాన్ని వేరుగా చూస్తుంది సమాజం! ఆ కుటుంబంలోని మనుష్యుల భవిష్యత్తుకు అది ఒక మచ్చగా పరిణమిస్తుంది.

ఇదేగనుక పుష్కలంగా డబ్బువున్నవాడు చేస్తే, భార్యను కొడుతూంటే, పరస్త్రీల సాహచర్యానికి అలవాటుబడి చెడిపోతూంటే - వాణ్ణి వేలెత్తి చూపించదు సంఘం! వాడి జీవితం బజారుపాలు గాదు, నలుగురు కళ్ళల్లో పడదు. ఎక్కడ వుంది ఆ కీలకం?

ఆ రోజురాత్రి వెంకటేశ్వర్లు ఇంటికి రాలేదు. భార్య వొస్తాడని రాత్రి తలుపు తెరిచే అట్టేపెట్టింది. కాని రాలేదు.

మరునాడు అన్నం తిన్నాక వెంకట్రామయ్య వొచ్చాడు వెంకటేశ్వర్ల ఇంటికి.

వెంకటేశ్వర్లు లేడు. వెంకటేశ్వర్ల భార్య పక్క లేని కుక్కిమంచంమీద పండుకొని ఆలోచిస్తున్నది. కంటివెంట నీళ్లు కూడా కారుతున్నవి.

'వెంకటేశ్వర్లు లేడట్టుందే?' వెంకట్రామయ్య ద్వారంలో వుండి అన్నాడు.

గబగబా లేచి, పైటచెంగుతో కళ్లు వొత్తుకుంటూ—

'లేరండీ!' అన్నది.

'రాత్రి రాలేదా?' అన్నాడు వెంకట్రామయ్య.

'రాలేదండి?' అన్నది వెంకటేశ్వర్ల భార్య.

'ఇక మనం ఏమనుకొని ఏం చేయగలం? నువ్వు ఏకధారగా యేడ్చీ లాభం లేదు. నేను దుఃఖించీ లాభంలేదు. అయితే నీ పొలం బేరం పెడుతున్నాడటగా? రాత్రి రామచంద్రయ్య చెప్పాడు. ఆయన్ని తీసుకోమన్నాడట. నువ్వేమన్నా పొలం యిస్తానని ఒప్పుకొన్నావా?'

వెంకటేశ్వర్ల భార్యకు అయోమయంగా తోచింది. పొలం అమ్మి డబ్బు ఇవ్వమనైతే అన్నారు గాని ఇలా బేరం పెట్టేటతన దగ్గరకు వొచ్చారని తెలీదు.

'నే నెందుకు యిస్తానండీ, నిన్న ప్రొద్దున ఇవ్వమనే రాయిగుద్ది కూర్చున్నారు. ససేమిరా నాగొంతులో ప్రాణం వున్నంతవరకూ నేనా పని చేయనని ఖచ్చితంగా ఒకటికి నాలుగుసార్లు చెప్పాను. ఏమనుకొన్నారో యేమో మాట్లాడకండా వెళ్లారు. మీరేమో పొలాన్నంతా నాశనం చేశారు. పెళ్లీడుకు ఎదిగివొచ్చిన పిల్ల వున్నది. దానికి రేపో మాపో పెళ్ళి చేయాలి. కట్నం యివ్వంది ఏ వరుడూ ముందరకు రాడు, అని గూడా చెప్పాను. 'ఏమైనా కానీండి, ముందరగా పెళ్లి చేసేస్తే మన బాధ్యత తీరిపోతుంది. వారి కేమన్నా పిల్లపెళ్ళివూసే లేదన్న సంగతి తెలుసుగా! మీరే ఓ కండి కొస్త మంచి సంబంధం-' అన్నది వెంకటేశ్వర్ల భార్య.

సరేనని వెళ్లాడు వెంకట్రామయ్య.

ఏమాటకామాటకు, వెంకట్రామయ్య

చాలా సౌమ్యుడు. తమ్ముడ్ని గురించి ఆయన వున్న విచారంలో, ఊళ్లో అప్రదిష్ట పాలవుతున్నాడే, తన వంశంలో తన తమ్ముడుగా జన్మించి - అన్న దిగులు అంతా యింతా కాదు. ఆయన తమ్ముడుతో లోకం సంగతీ, డబ్బుసంగతీ గౌరవంసంగతీ చెబుతూ, సన్మార్గంలోకి తేవాలని నిరంతరం కృషి చేస్తూన్నమాట వాస్తవమే. అది సోదర ప్రేమ కానీండి, మరే ప్రేమన్నా కానీండి! తనలోవాళ్లు, తనకి మరింత దగ్గరవాళ్లు, చెడుమార్గాన, విలాసాలకు అలవాటుపడి అగౌరవం పొందుతూంటే - తను చూస్తో వూరుకోవడమా? అనే మనస్తత్వం గల మనిషి నిజానికి వెంకట్రామయ్య.

## 3

ఎక్కడో, ఎవరో ముసలివాడు చస్తే, వెంకట్రామయ్య దినానికని వెళ్లాడు, ఆవూరు. చాలామంది కొస్త ధనికులనుకొన్నవాళ్లకూ వెంకట్రామయ్యకూ బాగా పరిచయం వుండటంమూలాన ఒక స్నేహితుడు రాత్రి పండుకోవటానికి తీసుకు వెళ్లాడు, తనయింటికి.

అతనికి వెంకట్రామయ్య అంటే అభిమానమే కాకుండా ఇష్టంకూడాను. చిన్నప్పుడు కలిసి చదువుకున్నారట.

మాటల సందర్భంలో తనకు పెళ్లీడు కొచ్చిన కొడుకు ఒకడు వున్నాడనిన్నీ, ఎక్కడేనా మంచిపిల్ల వుంటే చూసిపెట్టమనిన్నీ అన్నాడు, అతను వెంకట్రామయ్యతో అతను బాగా వున్నవాడు కాకపోయినా మంచివాడు. పదెకరాల మాగాణి. ఒక పెద్ద దొడ్డి. ఒకడే పిల్లవాడు. వెంకట్రామయ్య ఆలోచించాడు. ఈ సంబంధం వెంకటేశ్వర్లు కూతురుకైతే బాగుంటుం దనిపించింది.

'ఒక సంబంధం వుంది. మాతమ్ముడి కూతురు. నీకూ, నీకొడుక్కూ నచ్చితే'... నీళ్లు నమిలాడు, వెంకట్రామయ్య.

వెంకట్రామయ్యకు ఒక తమ్ముడు వున్నాడని తెలుసుగాని అతనికి ఒక కూతురు వున్నదనీ ఆ కూతురుసంబంధంకోసం వెతకాల్సిన బాధ్యత వెంకట్రామయ్య భుజాల మీద పడివుందనీ తెలీదు అతనికి.

'' ఇంకేం. ' అన్నాడతను.

కొడుకును చూపించాడు. అడో అతను. వెంకట్రామయ్యకు నచ్చాడు. పిల్లవాడిలో వోడు ఏమీ కనపళ్లేదు. అంత మరీ ఎత్తూ కాదూ, పొట్టీ కాదు. మధ్యస్థంగా వుంటాడు. ముఖానికి సరిపడ్డ ముక్కు. నాజూకైన పెదాలు. కలలు కనే కళ్లు అన ముకొని ఆలోచించే కళ్లు. పచ్చటి శరీరం.

ఇదంతా నచ్చిందికాని పిల్లవాడి చదువువిషయంలో వెంకట్రామయ్యకు అనుమానం వేసింది. తన స్నేహితుడుకి చదువుమీద ఆశే యిష్టమున్నట్టు కనబడదు. అంచాత కొడుకుకుగూడ చదువు చెప్పించాడో లేదో అని. అనుమానం తీర్చుకోగలందులకు అడుగుదామనిఅనుకొంటూండగానే, అతనే అన్నాడు. మాటమీద మాటవొచ్చి--

'మావాడు స్కూలుఫైనలువరకు చదువుకొన్నాడు. ఆపైన నేనే వద్దన్నాను. ఎటుగూడీ ఉద్యోగంచేసి జీవించాల్సిన గతిలేదుగనుక అని.'

ఇంకా ఎందుకని ఆలస్యం చేయాలో, ఇంకా ఏమేమి నచ్చాలో తెలీ లేదు వెంకట్రామయ్యకు. అంటే పూర్తిగా నచ్చింది, త్వరగా పెళ్లిచేయటం ఎంతైనా శ్రేయస్కరం అని.

వెళుతూ వెళుతూ 'వచ్చే శుక్రవారం నాడు పిల్లను చూడటానికి రండి. ఆపైన మరోమంచిరోజు చూసుకొని ముహూర్తం నిర్ణయించుకోవచ్చు. మీ పిల్లవాణ్ని మేం చూసినట్లే. అందులో మళ్లా చూడాల్సిన పనిలేదు. ఇకమీరు మాపిల్లను చూసి నచ్చటమే కావాల్సింది' అని వొచ్చేశాడు, వెంకట్రామయ్య పరమ సంతోషంతో.

ఈ సంగతి వెంకటేశ్వర్లు భార్యతో చెప్పాడు. ఆమె మరీ సంతోషించింది.

'మనంమటుకు ఎన్నాళ్లని వెతుకుతాం? వెదికినా ఇంతకంటె మంచి సంబంధం దొరకబోయిందా? పిల్లవాడుగూడా చాలా మంచివాడు. స్కూలు ఫైనలు వరకూ చదువుకొన్నాడుట. అంతవరకు చాలు. పిల్లవాడి తండ్రి నాకు బాగా తెలిసినవాడు గాబట్టి, కట్నం విషయంలో ఏదో ఒకాటి సర్దొచ్చు. మనంగూడా అంత మరీ ఎక్కువ ఇవ్వలేముగా. అప్పటికి మావాడి బుద్ధి సరిగ్గా వుండి, పెళ్లికి వొప్పుకుంటే - అది బాగుపడిపోతుంది ఈరాత్రి వస్తే నువ్వు ఈ సంగతి చెప్పు. అసలు నేనే చెబుతాలే కనబడితే, అనిగూడా అన్నాడు వెంకట్రామయ్య.

'అడుగుతాలెండి, వారు మట్టుకు కాదంటారా?' అని అన్నది వెంకటేశ్వర్ల భార్య. ఎటుతిరిగీ వారి కేమున్నా పెళ్ళిని గురించి ఆలోచనే లేకపోయె, ఇక తాము చేస్తామంటే ఎలాగో ఓలాగున వొదిలిపోయిందని సంతోషపడతారుగాని, ఒప్పుకోక ఏం చేస్తారు అనే వూహాగూడా పోయింది వెంకటేశ్వర్లు భార్యకి.

రాత్రి పదకొండుగంట లైంతరువాత యింటికొచ్చాడు, వెంకటేశ్వర్లు. మనిషి మనిషితీరులో లేడు. కళ్లు ఎర్రగా చింత నిప్పుల్లాగ వెలుగుతున్నయ్. గుడ్డలన్నీ మాసి వున్నయ్. అయిదు రోజుల్నాడు ప్రొద్దున పోవడం, ఇప్పుడు రావడం.

వెంకటేశ్వర్లు భార్య నిద్రకళ్లు తుడుచుకొంటూ, ఆవలించి - పెరట్లో కెళ్లి చెంబుతో నీళ్లు ముంచుకొచ్చి యిచ్చి, 'అన్నం తింటారా?' అన్నది.

మాట్లాడలేదు వెంకటేశ్వర్లు.

మళ్లా అన్నది వెంకటేశ్వర్లు భార్య, అలా అడగడం తన నిత్యధర్మమైనట్టు.

'వద్దు' అని కాళ్లు కడుక్కోకుండానే మంచంమీద పండుకున్నాడు, వెంకటేశ్వర్లు.

'ముందర కాళ్లు కడుక్కోండి, తరువాత పండుకొందురుగాని' అన్నది వెంకటేశ్వర్లు భార్య.

వెంకటేశ్వర్లు మాట్లాడలేదు. కొంచం సేపు ఎవరూ మాట్లాడలేదు.

తరువాత అన్నాడు గంభీరంగా వెంకటేశ్వర్లు - 'అయితే పొలం అమ్మవా?'

పక్క సర్దుకొంటూ 'మీ కింకా ఆపిచ్చి ఉద్దేశ్యం పోలేదా?' అన్నది

వెంకటేశ్వర్లు మాట్లాడలేదు.

'మీ అన్నయ్యగారు అమ్మాయికి పెళ్లి సంబంధం మాట్లాడారు. పిల్లవాడు మంచివాడట. పదెకరాలున్నవాడట. స్కూలు

(38-వ పేజీ చూడండి)



# విశాలాక్షి

రచన:
## శ్రీ భమిడిపాటి వెంకటరమణ

ప్రతి వేసవిలోనూ మామిడి పిందెలు కాస్తాయి. నాకు విశాలాక్షి జ్ఞాపకానికొస్తుంది. విశాలాక్షి విశాలమైన కళ్లుగల విశాలాక్షి. పదకొండేళ్ళయినా నిండని అంత చిన్నపిల్లా తన చిటికిన వ్రేలుతో నన్ను నా ఆశల్లోంచి ఆశయాల్లోంచి, ఆదర్శాల్లోంచి ప్రేమల్లోంచి, ఆనందతరంగాల్లోనించి తేలించి కొనిపోయిన దేవతవలె అనిపించింది. తన విశాలమయిన నయనాల్లో నన్ను ఉయ్యాలలూగించింది. యథార్థమైన అనుభవాలే స్మృతులుగానూ, స్మృతులే ఈగతి కథలుగానూ మారిపోతాయని నేను ఎన్నడూ అనుకోలేదు.

విశాలాక్షి పేరు విన్నా కొత్తమామిడి పిందెల తావులుగన్నా ఆకుల మరుగున దాగివున్న మామిడిపిందెలవలె కొద్ది కొద్దిగా కనబడ్తూ చవులూరించే అనుభవాలు తెరలు తెరలుగా విడుతూ నా కళ్ళ ఎదుట ప్రత్యక్షమవుతాయి. వాటిల్లో ఇప్పుడేవో కొత్తఅర్థాలు. గోచరిస్తాయి నూత్న సత్యాలు వినవస్తాయి. కాలం అనుభవాలకి యవ్వనాన్ని తొడిగి ఎంతటి మనోహరత్వం చేకూరుస్తుంది? గత కాలపు స్మృతులు, అవి ఎంతటి బాధకరమైనవి అయినా సముద్రపు అలలవలె హాయిగా స్నానం చేయించి పోతాయి. ఆ స్మృతులలో ఎంతో గాఢమైన మధురిమ ఉంటుంది.

ఒక ఏడాదిగా ఆ కొండమీద మేడ గదిలో ఉంటున్న నాకు పరిచయస్తులు ఒకరూ లేరు. మేడయింటికి తగిలి మూడు నాలుగు ఇళ్ళవాళ్లు దిగువున ఉంటున్నారు. కాని ఎవరికీ నేనెవరో తెలుసుకోవాలనే కుతూహలం ఉన్నట్టు కనబడలేదు. నాకు కుతూహలం ఉన్నప్పటికీ తీరికలేదు. బహుశా వాళ్ళ సంగతీ అంతేనేమో!

ఉన్నట్టుండి నా గది గుమ్మంలో ఒకనాడు ఒక హంస వాలింది. దిగువనున్న అరవవాళ్ల పిల్ల నాలుగేళ్లది – నెమ్మదిగా మెట్లెక్కి నాగది గుమ్మందగ్గర కొచ్చింది. అప్పుడే వికసించిన పద్మమువలె పరిశుభ్ర-

మైన ఆ ముఖంమీద మంచుబిందువులవలె నిర్మలమైన మందహాసం వర్షిస్తూ నన్ను చూస్తూ నిలుచుంది. ఆ అమ్మాయిపేరు పద్మ. వచ్చీరాని తెలుగు మాటలతో అరవ యాస చేరుస్తూ నన్ను తన స్నేహితుల్లో చేర్చుకునేందుకి అభ్యంతరం ఏమీ లేదని ఎలాగో తెలియపరచింది. అయితే ఒక షరతుమీద. నేను తనేమి కోరినా తెచ్చి ఇస్తూండాలి. పళ్లు, పిప్పరమెంట్లు, రిబ్బన్లు, జోళ్లు, ఆటబొమ్మలు మొదలైనవి. నేను ఆ చిన్న స్నేహాన్ని సులువుగానే కొనుక్కోగలిగేను. పద్మావతి వచ్చిపోవడం చూసి చుట్టుపక్కల నున్న 'లేడిపిల్లలు' 'నెమళ్లు' కూడా భయంలేకుండా నా ఆశ్రమవాకిట సంచరించడం సాగించాయి. కొన్నికొన్ని నన్నుచూసి భయపడి పరుగెత్తేవి. మరి కొన్ని కేకలు వేసి గోలచేసేవి.

ఒకనాడు ఈ పసిపిట్టలలో నెమలివలె కంఠం ఆడించుకుంటూ లేడివలె కళ్లు తిప్పుకుంటూ కాస్త వయస్సులో పెద్దగా ఉండే పిల్ల వచ్చింది.

పిల్లలంతా 'విశాల' అని పిలుస్తున్నారు. విశాల! సువిశాలనేత్రాలు. విశాల హృదయంగల తల్లివలె ఆ పసిపిల్లలను "నాతో రండి! మీ కేం భయంలేదు. అందరం కలిసి అతనిదగ్గరికి వెళదాం." అని నడిపించుకొని వస్తూంది. అంతమంది పిల్లలు పిట్టలులాగ ఒక్కమారు వచ్చి నాగది గుమ్మందగ్గర నిలబడి గోలచేస్తూవుంటే నా యింటికి ఏ దేవతలయినా స్వర్గంనుంచి దిగివచ్చారా అనిపించింది. పోయి చూశాను. పిల్లలు పారిపోలేదు. విశాలకు దగ్గరగా చేరి ఆ పిల్లను అంటిపెట్టుకొని ముఖాలు దాచుకొని దొంగచూపులు చూస్తున్నారు. నా యింటికి సనకసనందుల్లాగ ఇంతమంది అతిథులు ఒక్కసారిగా వచ్చారు. వీరందర్నీ సంతృప్తిపరచడమే నా విధి. బత్తాయిపళ్లు, కమలాలు ఒలిచి వారందరికీ సమర్పించాను. అందరూ వికసిల్లిన ముఖాలతో చిన్నచిన్న చేతుల్ని చాపి పుచ్చుకున్నారు. విశాలకుకూడా ఇవ్వబోయాను, కళ్లతో నా చెయ్యిని ఆపింది.

"నా కక్ఖర్లేదు. మా నాన్నగారు నాకోసం ఎన్నో పళ్లు తెస్తారు. మీరు ఇస్తేనే మేము తినగలం, లేకపోతే లేదని మీరు గర్వపడక్ఖర్లేదు - రండర్రా పోదాం!" అని పిల్లల్నందర్నీ రైలులాగ మళ్లించుకొనిపోయింది. నా గుండెల్ని బరువయిన భావమేదో క్రుంగదీస్తోంది.

కొంతసేపయాక నాగది గుమ్మందగ్గర నిశ్శబ్దంగా నెమలివలె చప్పుడు చేస్తూ ఏదో తారాడుతున్నట్టు అనిపించింది. పోయి చూస్తే విశాలాక్షి. నన్ను చూసి పరుగెడ్తూంది.

"ఆగవమ్మా, భయంలేదు! ఒకతెవు వచ్చేవా ఏరీ మిగతా పిల్లలందరూ?" అని పరుగెడ్తున్న ఆ పిల్లచేతులు పట్టుకొని



విశాలమైన ఆ కళ్ళలోకి చూస్తూ అడిగాను.

"ఇందాక మీరు నాకు ఇస్తానన్న బత్తాయిపండు తీసుకొనిపోదామని వచ్చాను. పిల్లలందరూ ఇళ్లకు వెళ్ళిపోయారు."

"అప్పుడు ఇస్తే వద్దన్నావెందుకు"

"అందరితోపాటు ఇస్తే నా అధికం ఏమిటి?"

"అందరితోనూ పుచ్చుకోకపోవడానికి నీ అధికం ఏంటి?"

"ఏ ఎక్కువా లేకపోతే నాకు అక్ఖర్లేదు. మీ బత్తాయిపండు మీదగ్గరే ఉంచుకోండి!"

అని వెళ్లిపోబోతూంది.

"ఉండు విశాలాక్షీ! బత్తాయిపండు తెచ్చుకొని మరీ వెళ్ళు. ఇందాక నువ్వు పుచ్చుకోలేదని నేనెంత బాధపడ్డానో పులుసా?"

"అందుకనే మళ్ళీ వచ్చాను. నిష్కారణంగా మిమ్మల్నెందుకు బాధపెట్టాలి అని."

పండు ఇస్తే అక్కడే నిలబడి ఒలుచుకొని తినడం ప్రారంభించింది.

"ఇంటికి వెళ్లి తినకూడదూ?"

"మా నాన్నగారు చూస్తే తన్నరూ?"

"భయమెందుకు?"

"మీదగ్గర పుచ్చుకొన్నానని తెలుస్తే"

"నాదగ్గర పుచ్చుకున్న సంగతి చెప్పకుమరి మీనాన్న నీకోసం ఎన్నో పళ్లు తెస్తుంటారుగా! వాటిలో ఇదొకటి!"

"ఉత్తదండి ఊరికనే అలాగ అన్నా!"

"ఏది ఉత్తది. నాన్నగారు పళ్లు తేవడమా? నిన్ను తన్నడమా?"

"రెండూనూ?"

"అసాధ్యురాలవే! అబద్ధం ఆడి, అబద్ధం ఆడినట్టు ఒప్పుకుంటున్నావు!"

"మీదగ్గర అబద్ధాలు చెప్పకూడదు అనిపిస్తోంది."

"మంచిదానవే!"

"మీ రిచ్చిన పండు మీ ఎదుటనే తింటూంటే మీకు ఆనందంగా ఉంటుంది కదండీ!"

"అవును విశాలాక్షీ."

విశాలాక్షి పసిహృదయం పట్టుబడడం ఎంత సులువు అయిందో దాన్ని అర్థం చేసుకోవడం అంత కష్టం అవుతోంది. పిల్లలతో కలిసి వచ్చినప్పుడు విశాలాక్షి నన్ను ఎంత అసహ్యించుకునేదో నేను చెప్పలేను. నా మీద తనకున్న కోపాన్నంతటినీ ప్రయోగిస్తుంది. నేను చేసే ఈ పనులు - పిల్లల్ని చేరదీయడం, వాళ్ళకు చిన్నచిన్న మేతలు వెయ్యడం ఎంత సబబు లేని పనో ఆలోచించమనేలా దెప్పిపొడుస్తుంది.

ఇలా చెయ్యడంలో నేనేదో ప్రతిఫలం వాంఛిస్తున్నట్టు, ఆ వాంఛించే ప్రతిఫలమే ఆ పిల్లలు నాకు ఇవ్వలేరన్నట్టు తెలియపరుస్తూ నన్ను పిచ్చివాడికింద జమకట్టి నామీదకి పిల్లల్ని స్వారీ చెయ్యమని పంపించేది. కాని ఒక్కర్తే వచ్చినప్పుడు విశాల వేరు. తన విశాలమయిన నయనాల్లో ఒక్క నేను తప్పితే ఇంకొక్కరి ఛాయ ఉండకూడదన్నట్టుగా చూస్తుంది. ఒక్క తనకు తప్పితే ఇతరులు ఇంకెవ్వరికీ నా మేలు అక్ఖర్లేదు అన్నట్టుగా మాటాడుతుంది. అప్పుడే తనకోసం ఏమి ఇచ్చినా పుచ్చుకుంటుంది. పుచ్చుకున్నందుకు తన కృతజ్ఞతనంతటినీ ప్రకటిస్తూ నా క్షేమ సమాచారాల్ని గురించి ప్రశ్నిస్తుంది. ఒకొక్కప్పుడు నా అందాన్ని గురించి వర్ణిస్తుంది. ఒకొక్కప్పుడు నా వీపెక్కి స్వారీ చేస్తుంది. విశాల విశాలహృదయం నేనిప్పుడే తెలుసుకోగలుగుతున్నాను.

నిజంగా విశాల నా మనస్సుని ఆకర్షించింది. అంతే కాదు. విశ్వరూపం ధరించి నన్ను అన్నివైపులా తన ప్రేమపూరితమైన విశాల నయనాలతో బంధించివైచింది. విశాలను నేనెక్కుడుగా ప్రేమిస్తున్నట్టు మిగతా పసిపిల్లలు పసిగట్టారు.

వాళ్లలో వాళ్లు ఏమేమో కీచులాడుకున్నారు. పద్మావతి మాత్రం నా ముఖం ఎదుటనే అనేసింది. "మీకు మొట్టమొదట స్నేహితు లయింది ఎవరండీ? నేను గదా! మరి నన్ను వదలిపెట్టి ఆ విశాలకు అన్నీ తెచ్చిఇస్తారే? ఏమండీ మీ రిలా చేస్తారు!" అని సాగదీసింది నన్ను ఆ అరవపిల్ల. ఆ చిన్ననోటిలో పెద్దవాళ్ళమాటలు వినిపించాయి నాకు.

విశాల కోరినదే తడవు - పుస్తకాలు, కాగితాలు, పెన్సిళ్లు, రిబ్బన్లు, జోళ్లు, గౌనులు, ఆటబొమ్మలు, పువ్వులు, పళ్లు తక్షణం ప్రత్యక్షమయేవి. ఈ విశాల నా సమయాలు ఎలా కనిపెట్టేదో, ఏ గోడ సందుల్లోంచి చూసేదో, ఏ కిటికీ కంతల్లోంచి చూసేదో ఎవ్వరూ ఎరగని వేళల్లో వచ్చి నాదగ్గరే ఉండేది నేనున్నంతసేపూ. ఎన్నో కబుర్లతో కుసుమవృష్టి కురిపించేది. సాయంకాలం నేను ఇంటికి రావడం కనిపెట్టి, సిల్కు గౌనుతో, రెండు జడలతో, కొత్త రిబ్బన్లతో, ఎత్తు మడమల జోళ్లతో ఏ గోడచివర్నో దాగిఉండి నేను ఇంటి నుండి బయటికి వచ్చి షికారు బయలుదేరుదామనుకుంటే గభాలున వచ్చి చెయ్యిపట్టుకునేది. విశాలతోపాటు వచ్చిన మిగతా పిల్లలు సందుచివరదాకా వచ్చి పళ్లో పిప్పరమెంట్లో పుచ్చుకొని ఇళ్ళకు మళ్లేవారు. విశాలమాత్రం నా చెయ్యి వదిలేది కాదు!

సాయంకాలం సముద్రపుఒడ్డున కూర్చుని ప్రక్కన సముద్రంలా ఉన్న ప్రజనుకూడా లక్ష్యపెట్టక విశాల తన విశాలహృదయాన్ని వెలిబుచ్చేది. తన విశాల నయనాలతో తన ప్రశ్నలకు నే నిచ్చే జవాబులు వినేది. నా చుట్టూ చేరి నన్ను ప్రేమసముద్ర తరంగాల్లో ముంచి యెత్తేది. ఈ ఆనందమంతా సముద్రపు తరంగాలమీదినుంచి వొచ్చే బరువయిన గాలివల్లనో, లేక విశాలాక్షి మాటల ఆటల స్పర్ధలవల్ల హృదయంలో జనించే భావ తరంగాలవల్లనో నాకు తెలిసేది కాదు - ఇంత చక్కని సంధ్యాకాలం తన రాగాల్ని ఇంతలో మార్చుకుంటుంది. ఇంతలో అంధకారపు ఛాయలు అలుముకుంటాయి. చీకటిపడితే విశాలాక్షి క్షణం ఉండదు. ఇంటికి వెళ్ళిపోవాలి. నాన్నగారు ఏడుగంటలకల్లా ఇంటికి వస్తారు. వారు రాగానే కంటబడకపోతే తనకు చీవాట్లు తప్పవు.

విశాల నాన్నగార్ని నేను ఎరగను. ఆయన్ని నేను ఎప్పుడూ చూడలేదు. మాటాడలేదుకూడా. ఇన్నాళ్లుగా ఇంత పరిచయం ఉన్న విశాల నాన్నగార్ని నేను తెలుసుకోకపోవడం విచిత్రం! అప్పు

డప్పుడు విశాల నాన్నగారంటే తనకుండే భయంఅమ్మ తనమీద చూపిస్తున్న అభిమానం చెప్పగా వినడమేకాని వార్ని ఇంతవరకు నేను చూడవలసిన అవసరం పడలేదు.

తలనొప్పిగా వుంటే మధ్యాహ్నం ఇంటికొచ్చి పడుకుందామనే ప్రయత్నంలో నే నుండగా ఎలా కనిపెట్టగలిగిందో విశాల నా గదిలోకి వచ్చింది. నే నిలా వేళకాని వేళల్లో ఇంటికిరావడం నెమ్మదిగా పడుకోబోవడం చూస్తే విశాలకిబాగాలేదు. నా తలనొప్పిని పోయేవరకు మాటలతో, గంతులతో, ఆటలతో తరిమికొట్టింది. విశాల నాన్నగార్ని గురించి తెలుసుకోవాలన్న కుతూహలం నాలో బాగా పనిచేస్తూంది.

"విశాలా, నాన్నగారు కులాసాగా ఉన్నారా?" అని అడిగాను.

"లేదండీ, నాన్నగార్కి మూడురోజులయింది ఒంట్లో బాగులేదు. గుండెనొప్పి. ఇంటిదగ్గరే ఉన్నారు ఆఫీసుకి వెళ్ళలేదు"

"నాన్నగార్ని నే నొకసారి వచ్చి చూసేదా?"

"నిజంగా వస్తారా?"

"పద విశాలా!"

విశాల చెంగున ఒక్కపరుగున దిగువకి వెళ్ళి అందరికీ వినబడేలాగ కేక వేసింది:

"నాన్నగారూ, మిమ్మల్ని చూడడానికి ఆ కొంపమీద ఉన్నాయన వస్తున్నారు!"

"మీరేనా ఆ పైన ఉంటున్నారు. కూచోండి!" అన్నారు విశాల నాన్నగారు.

ముమ్మూర్తులా విశాలనాన్నగారి పోలికే. ఆ కళ్ళు ఆయనముఖానికి ఒకవిధమైన గంభీరత చేకూర్చితే విశాలముఖానికి అందాన్ని తొడుగుతున్నాయి.

మూడు రోజులుగా జబ్బుతో ఉన్నా ఏమంటూ; ఊకూ లేదు. చూసేవాళ్లూ, చేసేవాళ్లూ ఎవరూ లేరు. భార్య, ఒక్కకుమార్తె అతను.

ఏకాకిజీవితం ఈడుస్తున్నాడు. నేను పోయి డాక్టర్నిచూసి మందు తెచ్చాను. పండ్లు కొన్నాను. పదిరోజులకల్లా విశాల నాన్నగారు మళ్లీ ఉద్యోగంలోకి వెళ్తున్నారు.

ఈసారి మా మైత్రి ఎక్కువయింది. నాన్నగారి అనుమతి లేకుండా నేమా షికార్లు, సినిమాలు సాగిపోతున్నాయి. ఒక్కొక్కప్పుడు ఆలస్యానికి జవాబు చెప్పకోవడం అందువల్ల నాన్నగారి ఆగ్రహానికి గురికావడం విశాలకి అలవాటయిపోయింది.

ఒకరాత్రి సినిమా చూసి వచ్చేటప్పటికి రాత్రి 10 గంటలయింది. విశాలను వాళ్ళ ఇంటిదగ్గర దిగవిడిచి నేను హోటల్‌కి వెళ్లేసరికి అయ్యరు అన్నం లేదన్నాడు. కాస్త మజ్జిగయినా ఉంటే ఇమ్మని ఆ రాత్రి దానితోనే సంతృప్తిచెంది, నిద్రపోదామని నేను నిశ్చయించుకుని గది తలుపు గడియ పెట్టబోయాను. గుమ్మంలో విశాల నాన్నగారు. నా కీరాత్రి పరీక్షలాగుంది. అయ్యరు అన్నం లేదన్నాడు. ఇప్పుడు విశాల నాన్నగారు ఏమన్నా అనేసిపోతారు. ఎలాగ ఈ కష్టాన్ని దాడటం.

"మీ రీపని చెయ్యడం ఏమీ బాగులేదు."

నాభయం నిజమయింది. ఇవాళతో నేను విశాల కలిసి సినిమాలకి వెళ్లడం ఆఖరు.

"పాప, మిమ్మల్ని పిలుచుకొని రమ్మంది"

"ఏమయింది, ఇంతలో!"

"ఏమీ లేదు. మీరు ఏమీ తినకుండా పడుకుంటున్నారని తెలిసి తనుకూడా ఏమీ తిననంటూంది!"

"నే నేమీ తిన లేదని ఎవరు చెప్పారు?"

"నేనెరుగుదును. అయ్యర్ని మీరు మజ్జిగయినా ఉంటే ఇమ్మని అడిగినప్పుడు నే నక్కడే ఉన్నాను." ఇక అబద్ధం చెప్పి తప్పించుకోలేను.

"మజ్జిగ తాగాను. కడుపు నిండుగా ఉంది. ఇంక నాకేమీ అక్కర్లేదు, నిద్రపోతాను."

"పోనీ మాకోసం కాకపోయినా పాపకోసమయినా..."

ఎలా వెళ్లకుండాఉండగలను.

"ఆయన ఇచ్చినవన్నీ కడుపెక్క తిని ఇలాటప్పుడు ఆయన కేమీ పెట్టకుండాను వ్యాక్కత్తెవు తినడం ఏమయినా బాగుందే పాపా!" అంటూ విశాలనాన్నగారు ఇంట్లోకి వెళ్లి విశాల పక్కనే ఒక కంచం వేయించారు.

"వేళకాని వేళలో ఆయన్ని పిలుచుకొచ్చారు; ఏమి పెట్టడానికి. నాకు సిగ్గేస్తోంది" అన్నారు విశాల అమ్మగారు విశాలకంచంలోనివే నాలుగు పూరీలు నాకంచంలో పెడుతూ.

"వేళకాని వేళలో వచ్చి తినడానికి నాకు సిగ్గేస్తోంది" అన్నాను నేను.

"సిగ్గుపడడానికి ఇది అత్తవారి ఇల్లు కాదు లెండి. కానివ్వండి త్వరగా!" అన్నారు విశాలనాన్నగారు.

విశాలాక్షీవాళ్ల కుటుంబంతో నాకు విశేషమైన మైత్రి ఏర్పడింది. మా ఆటలకి, పాటలకి అంతులేదనిపించింది. కాని మా ఆటలు పాటలు కట్టు మాయ

ఆఫీసుకు ఇంతదూరంనుంచి రోజూ నడిచివెళ్లడం తన ఆరోగ్యానికి సరి పడలేదని విశాలనాన్నగారు ఆఫీసుకి దగ్గరగా కొత్తగా నిర్మించిన "క్వార్టర్సు"లోకి పోయి ప్రవేశించాలని నిశ్చయించారు. ఈ సోమవారమే ఇల్లు మార్చుతారు. నిజమే నాలుగుమైళ్లదూరం రోజూ వెళ్లడం రావడం చాలా కష్టం. అందులో గుండెనొప్పి గల విశాలనాన్నగార్కి అది మంచిది కాదు. అక్కడికి వెళ్లడం అన్నివిధాలా శ్రేయస్కరం. ఇక్కడకన్న నయమే కావచ్చు. ఇరుగు పొరుగున ఉండేవాళ్లు తోటి ఆఫీసు ఉద్యోగులేగనుక వాళ్ల సహకారం లభించవచ్చు. అన్నివిధాలా బాగా వుంది. కాని విశాలకి మాత్రం ఈ ఆలోచన ఎంతమాత్రము ఇష్టంకాదు. నేనుకూడా వచ్చి వాళ్ల ఇంటిలోనే ఉంటేనో! వాళ్ల మామయ్యఅనో, బాబయ్యఅనో నాన్నగారు చెప్పలేరా? కాని నాకు ఆఫీసు దూరం అవుతుంది. అయితేనేం? ఏమా, నాన్నగార్కి గుండెనొప్పి రాలేదూ? అలాగే. అయితే అలాగెందుకు అవుతుంది. పోనీ నేను వాళ్ల ఇంటికి రోజూ వస్తూంటేనో, అదీ అసాధ్యమేమో?

"మీరు మాత్రం రోజూ మాయింటికి తప్పకుండా రావాలి, రావాలి సుమండీ." అని విశాల నాతో రోజల్లా చెప్పింది.

"తప్పకుండా వస్తాను" అన్నాను.

కాని చెప్పినట్టు చెయ్యవద్దూ? విశాల నాన్నగారు ఇల్లు మార్చి అప్పుడే పదిరోజులయింది. ఇంతవరకు నాకు వారి కొత్త ఇంటికి వెళదామంటే వీలుకాలేదు.

ఇల్లు ఫలానాచోట అని తెలుసు కాని ఆ ఫలానాచోటు ఎక్కడో నాకు తెలీదు. ఎవరేనా తెలిసిన స్నేహితుడు వస్తే కలిసి వెళదాం అని చూస్తున్నాను. ఇంతలో విశాల నాన్నగారికోసం వెతుక్కుంటూ వాళ్ళ బంధువులబ్బాయే ఒకరు వచ్చాడు.

విశాలకోసం వాళ్ల నాన్నగారు జుంకాలు పురమాయించారుట. అవి తీసుకొని ఆ అబ్బాయి వచ్చాడు. ఫలానాచోట ఉంటున్నారు వస్తే కలిసి వెళదాం అన్నాను. ఆయన సరే అన్నాడు. సాయంకాలం చీకటి చినుకు. నడిచి వెళ్లాం నాలుగు మైళ్లున్నా.

పోలీసు లైన్లలాగ నిర్మించిన ఇళ్లవరసలు. ఇందులో ఏ వరసలో ఏ యింటిలో ఉంటున్నారో విశాలనాన్నగారు. మాకు తెలియదు.

ఒకవరస చివర్ని నిలబడి అక్కడ కనబడ్డ ఒకాయన్ని ప్రశ్నిస్తున్నాను. గాలిలో నామాటలు ఎంతవేగంగా ప్రయాణం చేశాయో అంతకి రెట్టింపు వేగంతో నన్ను పిలుస్తూ ఆ చీకట్లో విశాల పరుగెత్తివచ్చి, నాకంఠాన్ని తన చేతులతో పెనవైచి గట్టిగా నన్ను హత్తుకుంది

"మీవన్నీ అబద్ధాలే! రోజూతప్పకుండా వస్తానని చెప్పి పదిరోజు లయింది రాకపోయారే! మీకిది ధర్మంగా ఉందా చెప్పండి?" అటూంది విశాల.

"ధర్మాధర్మాలు తరువాత విచారించవచ్చుగానీ, మొదట నీకోసం ఏమిటి తెచ్చానో చూడకూడదూ?" అంటున్నాడు వాళ్ల బంధువులబ్బాయి.

"ఈయన్ని తీసుకొచ్చావు నాకు అంతే చాలు అంది" విశాల.

"ఏమిటే, మామీద దయగలిగిందా మీకు యిలా వచ్చారు" అని నవ్వుతూ వచ్చారు విశాల నాన్నగారు.

"మీవాళ్ల అబ్బాయి విశాలకోసం మీరు చేయించమన్న జుంకాలు తెచ్చాడు. ఆయనకి దారి చూపుదామని నేనువచ్చాను:' అన్నాను.

"ఏవీ, ఏవీ చూద్దాం. ఇంతసేపయి చెప్పలేదేం?" అంటూంది విశాల.

"ఇంత సేపయి నేను చెప్తున్న దేమన్నా నువ్వు వింటేనా?" అంటున్నారు ఆయన.

"ఇదొక కారణం దొరికింది మీకు. మేము అదృష్టవంతుల మయాం. పాప ముఖంమీద నవ్వు చూడలేదు ఈ పది రోజులూ. తిండి ముట్టుకోదు. నిద్రపోదు. ఎప్పుడూ ఏదో ఆలోచనే - పాపం మీకోసం."

"ఆఁ. ఈయనకోసం రమ్మని!" అంటూంది విశాల.

పిచ్చిపిల్ల నాకోసం ఇంత బాధపడిందా అనుకున్నాను నేను.

ఇక విశాల కట్టతెగిన ప్రవాహంలాగ ఒకటే కబుర్లు. గుక్క తిప్పుకోకుండా ఈ పదిరోజుల్లో జరిగిన సంగతులన్నీ ఏకరువు పెట్టింది కొత్తచోటు, కొత్తమనుష్యులు, కొత్తకొత్త స్నేహితులు, కొత్త కొత్త ఆటలు, పాటలు అన్నీ బాగానే ఉన్నాయిగానీ నేను రాకపోవడం తనకెంత కష్టంగా ఉండెను.

ఇంత నిర్దయుణ్ణి నన్ను తగ్గట్టు దండించింది. ఆరాత్రి నిద్రపోయేసరికి రెండుగంటలయింది.

ప్రతి శనివారం సాయంకాలం నేను వాళ్ళింటికి రావాలి. ఆరాత్రి, ఆదివారమల్లా అక్కడే వుండి సోమవారం ఉదయం అక్కణ్ణుంచే బయలుదేరి ఆఫీసుకి వెళ్ళాలి. ఇది విశాల చేసిన శాసనం. దీనిలో ఒక్క అక్షరమయినా తప్పడానికి నాకు అధికారం లేదు.

ఈ రెండురోజులూ నన్ను ఎవరూ, ఏపనిమీదా ఆపి మాటాడడానికి విశాల అంగీకరించదు. అనవసరమైన పనులు ఆదివారం నాడు చెయ్యకూడదు. అందవికారమైన వాళ్లను ఆరోజున చూడకూడదు. అర్థంలేని మాటలు ఆడకూడదు. వినకూడదు. విశాల స్వయంగా వండిపెట్టేది

మధ్యాహ్నం మామిడితోటలో, మామిడి చెట్లనీడలో, మామిడి పువ్వుల మత్తువాసనల్లో, మామిడిపిందెల దాగుడుమూతల్లో మా హృదయంలో దాగిఉన్న భావాలు స్వేచ్ఛగా బయటికి వచ్చి సంచారం చేస్తాయి.

ఇటువంటి సమయంలో విశాలకు అతీతమైన విజ్ఞానోదయం కల్గుతుంది. నా చెయ్యి చూసి జాతకం చెప్తుంది.

"చాలా అదృష్ట జాతకం! పదిమంది పిల్లలు!"

"నాకేమీ అభ్యంతరం లేదు. నీ యిష్టమే!" అని నేను.

"అమ్మా చూడవే, ఈయనెలా అంటున్నారో!" అని అమ్మకి రిపోర్టు చేస్తుంది విశాల.

"అన్నంతమాత్రాన ఏమయిందితే? ఆయన నిన్ను పెళ్లిచేసుకున్నప్పుడు కదా నీ యిష్టం?" అంది ఆవిడ.

"నాకొద్దు బాబోయ్. ఇటువంటి వాళ్లతో పెళ్లి. వీళ్లు పెద్దపెద్ద కట్నాలు తెచ్చిపెట్టమంటే మా నాన్నగారు ఎక్కణ్ణుంచి తేగలరు? నేను పెళ్లిచేసుకోదలుస్తే మా అత్తకొడుకు సుబ్బారావు ఉన్నాడు, వాణ్ణి చేసుకుంటాను. ఇంతకన్న మంచిది"

విశాల నా ప్రేమని విలువకట్టూంది. బాహుశా ఇది పెళ్లిగా పరిణమిస్తే నాప్రేమ ఎన్నివేల రూపాయలు కోరుతుందో అని అంచనా వేస్తోంది విశాల. నిత్యంజరుగుతూండే పెళ్లిళ్లలోనిఆచారాల్ని చూసి. అమాయకురాలు నాన్నగారి మేలు కోసం ఎంతత్యాగం చెయ్యడానికి వీలవుతుందో చూస్తోంది.

మధ్యాహ్నం మామిడితోటలోకి లాక్కెళ్లిందివిశాల. ఒకచెట్టునున్న మామిడిపిందెలు గుత్తులుగా కోసి తీసుకురమ్మంది. చెట్టు ఎక్కగానే చేతికందిన నాలుగు పిందెల గుత్తికోసి ఇచ్చాను. పుచ్చుకొన్న వెంటనే అందులో ఒక పిందె తెంపి, ముక్కలు చేసి తినబోయింది. తినలేక ముక్కల్ని పారేసింది. మిగిలిన మూడుపిందెలతో గుత్తిని ఇంటికి తెచ్చి గోడకి తగిలిస్తూ నేను అన్నాను.

"విశాలా, ఆ గుత్తిలోని పిందెలు మరి తియ్యకు. ఇవి మీ ఇంటికి అలంకారంగా ఉన్నాయి. నువ్వూ, మీ అమ్మా మీ నాన్నగారు ఈ మామిడి పిందెలగుత్తిలా కలిసిఉన్నారు"

"అయ్యో, ఎంతపొరపాటయింది. ఆనాలుగో పిందెకూడా వుంటేఎంత బాగుండేది. అదివుంటే మీరుకూడా మా యింట్లో కలిసి ఉన్నట్టు ఉండేదికదూ? నిష్కారణంగా తెంచేశాను?"

"విచారించ నక్కర్లేదు విశాలా! నాలుగేసి పిందెల గుత్తులు ఇంకెన్ని లేవు? ఇది కాకుంటే ఇంకొక్కటి!"

"ఒక్కటే ఎలాగవుతుంది? ఆ గుత్తిలో మీరు లేందే.

"దానికి మనమేం చెయ్యగలం? త్రుంచగలంగాని మళ్లీ రచించలేము!"

ఈమాటలు విశాలకు బోధపడి వుండకపోవచ్చు.

నాకుమాత్రం బోధపడింది. స్పష్టంగా మరి రెండురోజుల్లో మామిడి పిందెలగుత్తిలోని నాలుగో మామిడిపిందెవలె నేను నిష్క్రమించవలసిన సమయం వచ్చిందని. కాని దీనికి కారణం ఎంతకఠోరమయినది? ఇది విధి నిర్ణయమా? మనుష్యులలోని అసూయ విషజ్వాలల ఫలితమా? ఇప్పటికీ చెప్పలేను!

విశాలను వెతుక్కుంటూ నేను పెరటి గుమ్మంలోకి వెళ్లేసరికి ఆగోడకి అంటించి ఉన్న కాగితం నాకంటబడింది. నా కళ్లను నేను నమ్మలేకపోయాను.

నా హృదయంలో భారం నన్ను క్రుంగదీసింది. నా జ్ఞానం నన్ను విడిచిపెట్టింది. భూమి తిరుగుతున్నట్టు నాకు బోధపడింది.

(30-వ పేజీ చూడండి)

# డిటెక్టివ్ సీరియల్:




## 9

మర్నాడు సెషన్స్ కోర్టు కిటకిట లాడుతోంది. జడ్జి రాగానే ప్రాసిక్యూటర్ లేచి ఒక మనవిచేశాడు. కొన్ని కారణాల వల్ల నేర పరిశోధన ఇంకా జరగవలసిన అవసరం కలిగిందనీ, పరిశోధన ఫలితంగా పరిస్థితి తారుమారయిందనీ, కాబట్టి విచారణ వాయిదా వేయాలనీ విజ్ఞప్తిచేశాడు. కోర్టులో చేరిన వారందరికీ ఆశాభంగమయింది. దుర్గయ్యకి మాత్రం ప్రాణం లేచి వచ్చినట్లయింది. కమల మాధవరావు వంకతిరిగి కృతజ్ఞతా సూచకంగా చూసింది. ఆయన చేతులు పట్టుకుని, "పెదనాన్నగారూ మామయ్య విడుదలౌతాడా?"

"ఆ విడుదలౌతాడు. కాని అప్పుడే కాదు. కొంచెం పని ఉంది. అది చేస్తూనే నా మకాంకి వెళదాం."

ఇద్దరూ కారులో కూచున్నారు. మాధవరావు అడిగాడు "ఇప్పుడు నా మకాముకి పోదామా, మీయింటికి పోదామా?"

"మకాముకని మీరిప్పుడే చెప్పారుగా"

"ఊరికే అన్నాను. పద మీ యింటికి పోదాం."

కమలకి అర్థమయింది కాదు. దుర్గయ్యని తీసుకుని కారు దిగి ఇద్దరూ లోపలికి వెళ్ళారు. హాల్లో కూచోగానే కమల అడిగింది. "పెదనాన్నగారూ మామయ్య విడుదలౌతాడని నా కిప్పుడు నమ్మకం కుదిరింది. కాని హంతకుడెవరో పోలీసులు కనిపెట్టారా?"

"తేలిపోతుంది. ఇప్పుడే ఒక గంటలో తేలిపోతుంది."

"ఎ - ?"

"తొందరపడకు. రామచంద్రరావు నాకేమో ఒకసారి కబురు పంపు నేను వెంటనే రమ్మంటున్నానని. అంకరాజు ఇప్పుడెక్కడున్నాడో చూడాలి."

"ఎందుకు? అంకరాజు చేసివుంటాడా?"

"లేదు. అతనొక నేరం చేశాడు. పోయిసారి నీవు బెంగుళూరులో ఉన్నప్పుడు రామచంద్రరావు ఉత్తరం రాశాడు జ్ఞాపకం ఉందా? రామనాథంతో చేరి కుట్రపన్ని, తన ఇంటి పక్కనున్న షావుకారుదగ్గర పదివేలరూపాయలు తీసుకున్నాడు అంకరాజు, దుర్గయ్య వ్యాపారంలో తనవాటాని అతనికి అమ్మేశాడు. దీనికోసమే మీ అత్తనికూడా తీసుకుని రామనాథం బయలుదేరి బెజవాడ వచ్చాడు. అమ్మకంపైన సంతకాలైనాయి. దాని మీ మామయ్య సంతకాన్ని అంకరాజు ఫోర్జరీచేశాడు

"మీ మామయ్యని చిక్కుల్లో పెట్టి, వ్యాపారంలో కొంత షావుకారుకి కట్టబెట్టి, తాను వాటాదారై, ఆస్తినంతా సంగ్రహించాలని మీఅత్త— రామనాథం ప్రోద్బలం మీద— పన్నాగం వేసింది. అంకరాజు పదివేలరూపాయలు తీసుకుని, ఇంకా గుంజుకోడానికి వీలుంటే ప్రయత్నించాలని ఒక ప్లీడర్ని వెంటబెట్టుకుని బెంగుళూరు వచ్చాడు. కాని అక్కడది పొసగలేదు. అందరూ ఇక్కడికిరాగానే అంకరాజు గాబరాపడ్డాడు. కాని సంసారంతోసహా పారిపోవడంకష్టం. అంకరాజు బెంగుళూరు వెళ్ళడం కనిపెట్టిన రామనాథానికి అనుమానం తగిలింది. వెంటనే మీఅత్త, రామచంద్రరావు మాట్లాడారు. మీ మామతో రాజీకి వీలుందనిచెప్పగానే ఫోర్జరీ అమ్మకానికి నీళ్లు వొదులుకుని రామనాథం, పార్వతమ్మ మీ యింటికివచ్చారు. అంకరాజు పారిపోతాడని ఇక్కడ మనం అనుకోడం వాళ్లు విన్నారు వెంటనే రాత్రి పదిగంటలకి సత్యనారాయణ, పార్వతమ్మ అంకరాజు ఇంటికి బయలుదేరారు. వాటా అమ్మకానికి కుట్రపన్నిన రామనాథం ఇంటిదగ్గిర ఉండిపోయాడు. ఇద్దరూ పాతవూరు వెళ్లి అంకరాజుతో మాట్లాడారు. డబ్బు తిరిగి ఇవ్వాలన్నారు. ఆ డబ్బు షావుకారుకే ఇస్తానని చెప్పి అంకరాజు తప్పించుకోడానికి ప్రయత్నించాడు. పక్క ఇంట్లో కాపుదల ఉన్న రామచంద్రరావుని పార్వతమ్మ పిలిచింది. రామచంద్రరావు కూడా బెదిరించాడు. కాని డబ్బంతా అయిపోయిందనీ, అయిదువందలే మిగిలిందనీ చెప్తూ, అది రామచంద్రరావుకి ఒప్పగించాడు. సత్యనారాయణ, పార్వతమ్మ ఆ డబ్బు తీసుకుని కొత్తిన గుడ్డ వేసుకుని తిరిగి వొచ్చేశారు."

"మరి ఈ రాయబారాల సంగతి రామచంద్రరావు ఎవరికీ చెప్పలేదే?"

"ఎందుకు చెప్పలేదో తెలియదు. ఇంతేకాదు. నువ్వుకూడా నాకు కొన్ని విషయాలు చెప్పలేదు."

"ఏమిటది?"

"హత్య జరిగిననాటి రాత్రి నీ గదిలో తాళంచెవులగుత్తి పూలకుండీ కిందికెల్లా వెళ్లింది?"

కమల తెల్లబోయింది.

"నిద్రలో నడిచేవాళ్లని గురించి శాస్త్ర

కాలు చదవడం ఎప్పటినించి మొదలు పెట్టావ్ ?"

"దాదాపు నెలరోజు లౌతుంది."

"కారణం ? మీ మామకోసమేనా ?"

"నేనుకూడా నిద్రలో లేచి నడుస్తున్నా నని నాకు అనుమానం కలిగింది."

"నిద్రలో లేచి నడిచినప్పుడు తాళం చెవులు తీసి పూలకుండు కింద పెట్టడం నీకు అలవాటా ?"

"అవును"

"పోనీ నువ్వు నిద్రలో లేచి నడుస్తున్నా నని ఎవరికేనా తెలుసా ?"

"ఏమో నాకు తెలియదు."

"మీ మామ పైన ఎవరికైనా అమిత ద్వేషంకాని, ఆయనంటే అమిత భయం కాని ఎవరికైనా వుందా ?"

"ఉంటే మా అత్తకే ఉండాలి."

"కాదు నిజం చెప్పు. నీకు తెలుసు"

కమలకి ఏమీ తోచిందికాదు. ఇంతలో ఇన్స్పెక్టర్ నరసయ్య గబగబా మేడమెట్లెక్కి వచ్చాడు. మాధవరావు లేచి వెళ్ళి అతనిని గుమ్మంలో కలుసుకున్నాడు.

"మీరు అనుమానించినది నిజమే ప్లీడరు గారూ ? అతను మాయమైపోయాడు."

"అన్ని స్టేషన్లకీ కబురు పెట్టండి, ఎక్కడికీ పారిపోలేడు. ఆమాట కేమిగాని ఆధారాలేమైనా దొరికాయా ?"

"లేదు ప్లీడరుగారూ. కేవలం ముగ్గురి సాక్ష్యాన్ని ఆధారంగా పెట్టుకుని కేసు నడపవలసి ఉంటుందని ప్రాసిక్యూటర్ అంటున్నారు. కేసు నిలవడం కష్టమని కూడా ఖచ్చితంగా చెప్పాడు."

"అది ఫరవాదులెండి, సాక్ష్యం బలంగానే ఉంటుంది."

కమల ఆ వేగంతో అడిగింది. "ఎవరు మాయమైపోయినది? హంతకుడెవరో తెలిసిందా?"

ఇన్స్పెక్టర్ ఏదోచెప్పబోయి, మాధవరావు వంకచూసి చప్పున ఊరుకున్నాడు, మాధవరావన్నాడు. "తెలిసింది, ఒక్కక్షణం ఓపికపట్టు, ఇంకాపనిపూర్తి కాలేదు."

కమలకి ఉద్రేకం ఆగలేదు. కాని ఊరుకోకతప్పిందికాదు. మాధవరావు బయలుదేరాడు. ఎందుకో తెలియకుండా కమల మౌనంగా అతనివెంట బయలుదేరింది. మాధవరావు వద్దనలేదు. ఇన్స్పెక్టర్ వెళ్లిపోయాడు.

డాక్టర్ మూర్తిగారింటి కొచ్చిందికారు. మాధవరావు, కమల గదిలోకి వెళ్లికూచున్నారు.

మాధవరావు శ్రద్ధగా ఆమెనిపరిశీలిస్తూ మెల్లిగా అన్నాడు. "నేనడిగిన దానికి నువ్వు సమాధానమివ్వలేదు, నీకు తెలుసును. అవునా?"

"ఏమిటది?"

"ఇంతలోనే మరిచిపోయావా? పోనీ ఇంకొకటి అడుగుతాను చెప్పు. నువ్వింతవరకూ పెళ్ళెందుకు చేసుకోలేదు?"

"మీకు ఇదివరకే చెప్పానుగా"

మాధవరావు ఏదో అడగబోయి కొంచెం తటపటాయించాడు. కొంతసేపు ఇద్దరూ మౌనంగా ఉన్నారు. కాని కమలకి మౌనం దుర్భరంగా ఉంది. కూర్చోలేక లేచి కిటికీ వద్ద నిలబడి పూల మొక్కలవంక చూసింది. కాని దృష్టి పూలపైన లగ్నం కాలేదు. మాధవరావు వైఖరి తలుచుకున్న కొద్దీ ఆమెకి భయం ఇనుమడించింది. మెల్లిగా వెనక్కితిరిగి వెళ్ళి మాధవరావు ముందు నిలబడింది. ఏదో మాట్లాడబోయింది. కాని వొణుకువచ్చి ఆమె కంఠాన్ని అణిచివేసింది. మాధవరావు పక్క కుర్చీని దగ్గిరకి లాగి ఆమెను అందులో కూచోబెట్టాడు. "భయం దేనికమ్మా. హంతకు డెవరో తెలిసింది. పట్టుబడ్డానికి ఆట్టే సేపుపట్టదు. గుట్టు బైట పడిందని పసిగట్టగానే ఉడాయించాడు. మీ మామ విడుదలౌతాడు. పోలీసులే ఆయనమీద కేసు రద్దు పరుచుకుంటున్నారు."

"కాని హంతకు డెవరో చెప్పకుండా నాదగ్గిరెందుకు దాస్తున్నారు ?"

"కారణం ఉంది. ఇప్పుడు నువ్వొక స్టేట్మెంట్ మేజస్ట్రేట్ సమక్షంలో ఇవ్వాలి. హంతకుడిపైన కేసు ముఖ్యంగా నీ వాఙ్మూలంపైన ఆధారపడి వుంటుంది. అందువల్ల నీకు చెప్పలేదు. అంతే, మీ మామయ్యకోసం కొంచెం ఓపికపట్టు. ఇప్పుడే మనకి కబురొస్తుంది. మేజిస్ట్రేట్ కోర్టుకి వెడదాం."

## 10

ఆరాత్రి ప్రాసిక్యూటర్ మాధవరావు మకాముకి వచ్చాడు. కమల రోజంతా అక్కడే వుండిపోయింది. ఇద్దరూ మాట్లాడుతోంటే కమల మౌనంగావింటోంది. మాధవరావు అడిగాడు.

"అయితే సాక్ష్యానికి మీరు రామచంద్రావునికూడా ఎందుకు వేసుకున్నారండీ"

"వేసుకున్నా మన్నమాటే కాని అతనికి ఇష్టంలేదు సాక్ష్యమివ్వడం. కాని అతను చెప్పిన విషయాలు చాలా ముఖ్యమని తోచింది మాకు"

"ఏవిషయాలు?"

"హత్య జరిగిన రాత్రి పార్వతమ్మగారిని దుర్గయ్యగారింట్లో విడిచిపెట్టి పాతవూరు వెళ్ళాడు. వెళ్ళే ముందు హాల్లో కమలతో చెప్పాడు. చెప్తున్నప్పుడు ఈమె అలమారుకు తాళం వేస్తోంది. అప్పుడు అలమారులో కత్తి లేదుట. కాబట్టి దుర్గయ్యగారు రాత్రి వేళ అలమారు తెరిచి కత్తి తీశాడని సత్యనారాయణ చెప్తున్నది అబద్ధం అంటాడు రామచంద్రావు. కత్తి దుర్గయ్యగారి తలగడకింద వుంది కాబట్టి అలమారుకి తాళం వెయ్యక ముందే దుర్గయ్యగారు దురుద్దేశంతో కత్తి తీసి దాచిపెట్టుకున్నాడని మేం అనుకున్నాం. ఇది ఇల్లాతిరిగే సరికి రామచంద్రావు సాక్ష్యం ఇవ్వనన్నాడు."

"అలమార్లో కత్తి ఉందో లేదో చూసే తాళం వేశావా కమలా ?"

"నాకు అంత జ్ఞాపకంలేదు, కాని అలమారుకి తాళం వేసినప్పుడల్లా లోపల కత్తి వున్నదీ, లేనిదీ చూడటం నాకు అలవాటు. అలాగే ఆ రోజూ చూశానని నానమ్మకం. ఉన్నట్లే నాకు గుర్తు. లేదని అతను చూస్తే నాకు చెప్పేవాడే. బహుశా పాతవూరు వెళ్లే తొందరలో మరచిపోయి వుంటాడు."

ప్రాసిక్యూటరు మళ్లీ చెప్పడం మొదలు పెట్టాడు. "ఆ రాత్రి పదిగంటలకి సత్యనారాయణ, పార్వతమ్మ అంకరాజింటికి రావడం కనిపెట్టాడట. కనిపెట్టి వాళ్ళిద్దరూ వెళ్లిపోగానే తను అంకరాజింటికి వెళ్లాడు. ఏచిక్కులూ లేకుండా దుర్గయ్య గారితో వ్యాపారం పరిష్కరించుకోడానికి వీలుందని నచ్చచెప్పేడట. అంకరాజు నమ్మక పోయేసరికి పోలీసులకి ఒప్పగిస్తానని భయపెట్టాడట. తరవాత రాత్రిఅంతా పక్క ఇంట్లో

కాపలా వేసి అంకరాజు పారిపోకుండా కని పెట్టినట్లు చెప్పాడు. అంతే."

ప్రాసిక్యూటర్ కొగితాలకట్ట పక్కన పడేశాడు. మరచెంబులో నీళ్లు గ్లాసులో పోసుకుని గడగడా తాగేశాడు. విశ్రాంతిగా కుర్చీలో వెనక్కి చేరబడ్డాడు. కమల దృష్టి కిటికీలోనుంచి దూరాన చీకట్లమీదికి మళ్ళింది.

మాధవరావు ఆమెవంక పరీక్షగా చూశాడు. యథాలాపంగా అడిగాడు. "కమలా, నీ పెళ్లివిషయంలో మీ మామయ్య ఏమైనా ప్రయత్నం చేశాడా?"

కమలకీ ప్రశ్న చెవుల కెక్కడానికి కొంత వ్యవధి పట్టింది. నిస్పృహతో సమాధానం ఇచ్చింది. "జరిగిన ప్రయత్నాలు చాలు. నాకు పెళ్లీవద్దు, ఏమీవద్దు. ముందు ఇదేదో తేలి మా బతుకు తెరిపినిపడితే చాలు."

"నిజమే, కాని మీ కింక బెంగలేదు. మీ మామయ్య విడుదలకి ఆర్డర్ వెళ్లింది. నువ్వే లేకపోతే మీ మామయ్య ఒంటరైపోయేవాడు. అందుకే నీకు పెళ్లిచెయ్యడమంటే భయపడేవాడు; అంతేనా?"

"అవును. అది కొంత నిజమే."

"అందుకే మీమామయ్య నిన్ను బెదిరించేవాడుకాదూ, జీవనానికి అన్యథా ఆధారపడ నక్కరలేనివాడు దొరికితే తప్ప పెళ్లికొప్పుకోనని? లేకపోతే, నీకుకొంత ఆధారం కల్పించి ఈ పాటికి ఏదో సంబంధం స్థిర పరిచేవాడుకదా?"

"అవును. అయితే చివరికి పెళ్లిమాట నాకేవిడిచిపెట్టాడు."

"అయినా ఇంతవరకూ నువ్వు పెళ్లెందుకు చేసుకోలేదు? రామచంద్రరావు సమర్థుడని మీ మామకు తెలుసుగా? అతనిమీద నమ్మకం కుదిరిందిగా?"

"నిజమే. నాకు తొందరేమీ కనిపించలేదు."

"ఎక్కడా ఆధారం లేక మీ మామ ఎప్పుడో చిక్కులో పడిపోతాడని తెలిసి కూడా నువ్వు తొందరపడలేదంటే ఆశ్చర్యంగా వుంది. అదీకాక నువ్వు జీవితంలో ఏమనుభవించావని ఈ వైరాగ్యంలో పడ్డావ్? తొందర లేకపోవడం నీ ఒక్కదానికే కాదు. రామచంద్రరావుకూ లేకపోయింది. అంతేనా?"

"అదీ కాదనలేను"

"రామచంద్రరావుని చేసుకుంటే నీకు ఆస్తిగాని, ధనంగాని ఇవ్వనని మీ మామయ్య బెదిరించాడు కాదూ?"

కమలకి ఏం చెప్పడానికీ తోచిందికాదు.

"అలాగని మా మామయ్య మీతో చెప్పాడా?"

మాధవరావు సమాధానం చెప్పలేదు. ప్రశ్నార్థకంగా ఆమెవంక చూస్తూ ఉండిపోయాడు.

"అలా నిష్కర్షగా మామయ్య ఎప్పుడూ బెదిరించలేదు. నాతోను, చిన్న మామయ్యతోను రెండు మూడు సార్లు చెప్పాడు. అంతే."

"రామచంద్రరావుతో చెప్పలేదా?"

"లేదు."

"చనువుండి కూడా ఎందుకు చెప్పలేదు.? నమ్మకం కుదిరికూడా పెళ్లికి ఎందుకు ఒప్పుకోలేదు?"

కమలకి సమాధానం దొరకలేదు. మాధవరావు గొంతు సవరించుకొని జాగ్రత్తగా పలుకుతూ అన్నాడు. "రామచంద్రరావు నసెవడి మంచిదికాదని మీ మామకి అనుమానం తీరలేదు. నువ్వు రామచంద్రరావుతో స్నేహంగా వుండటం ఆయనకి ఇష్టంలేదు. మీ అత్తవల్లనే రామచంద్రరావుకి మీ యింట్లోస్థానం దొరికింది. ఆపైన నీకు అతని పట్ల సదభిప్రాయం కలిగింది. అంతేనా?"

కమల అప్రతిభురాలై కళ్లు పెద్దవిచేసి మాధవరావు వంక చూస్తూ ఉండిపోయింది.

"మొదట మీ మామ రామచంద్రరావుని అవమానించాడు కూడా. కాని అతను అది సహించి, మీ అత్త ప్రాపుతో ఇంటికి వస్తూవుండేవాడు. అతను లేకపోతే మీ మామ చంపుతాడని మీ అత్త భయపడింది. ముందు మీ అత్తవల్ల, తరవాత నీవల్ల రామచంద్రరావు మీఇంట్లోచేరాడు - మీ మామకి ఇష్టంలేకపోయినా. అతని వద్ద ఒక్కటీ దాచకుండా ఇంటి విషయాలన్నీ ఏకరువు పెట్టడం నీకు అలవాటయింది. నువ్వుకూడా నిద్రలో లేచి తిరుగుతున్నట్లు అతను కని పెట్టాడు. అతనే నీకు దాన్ని గురించిన పుస్తకం కొని పెట్టాడు. తాళం చెవులూ, కత్తీ పూలకుండు కింద నువ్వు దాస్తున్నట్లు అతని కొక్కడికే తెలుసును. అవి దొరికేసరికి క్షణంలో ఉచ్చు పన్నాడు. మీ అత్త గది మారినట్లు అతనికి తెలుసు. సత్యనారాయణనీ, రామనాధాన్నీ అక్కడనించి పంపేసి, మీ అత్తని మాత్రం అక్కడుంచి తన పని పూర్తిచేసుకోవాలనుకున్నాడు. అంకరాజు పారిపోతాడని మీకు అత్తకి అతనే చెప్పాడు. రామనాధం ఉండిపోయి, పార్వతమ్మ పాతవూరు వెళ్లేసరికి ఎత్తుమార్చవలసివచ్చింది. మళ్లీవాళ్లు దుర్గయ్య ఇంటికి వెళ్లటం చూశాడు. వాళ్లు చూడకుండా వెనకాలే బయలుదేరి మీ ఇంటి కొచ్చాడు. అంకరాజు ఆ రాత్రే షావుకారింటికి వెళ్లి ఫోర్జరీ చేసిన పత్రాన్ని తన కిచ్చెయ్యమని కోరాడు. అదికొనసాగనందువల్ల భయపడుతూ తిరిగివచ్చి రామచంద్రరావుని పిలిస్తే అతనక్కడలేకపోయాడు. రామచంద్రరావు దుర్గయ్య మేడముందు పూల తోటలో అదను కోసం వేచి కూచున్నాడు. పన్నెండుంబావుకి నువ్వు నిద్రలో లేచి వెళ్ళి అలమారు తీశావు. సత్యనారాయణ ఆ రాత్రి నిన్నే అలమారు దగ్గర చూశాడు. నువ్వు అలమారు తెరిచి కత్తితీసి మళ్లీ అలమారుకు తాళం వేసి, కత్తినీ, తాళంచెవుల గుత్తినీ పూలకుండు కింద పెట్టావు. మూడుగంటల వేళకి రామచంద్రరావు మెల్లిగా మేడ ఎక్కి పూలకుండు కిందనున్న తాళంచెవులూ, కత్తీ తీసి గున్నేశ్వరరావు పడుకున్న గదిలో ప్రవేశించాడు. గదిలోనుంచి తిరిగివచ్చి మీ మామ పడుకున్న గదికి నువ్వువేసిన తాళం తీశాడు. నెత్తుటి కత్తిని మీ మామ తలగడకింద పెట్టి తిరిగి పాతవూరు వెళ్లిపోయాడు. మర్నాడు పొద్దుటే వచ్చి, అంకరాజు ఇంటికి వచ్చాడని మీ యిద్దరితోను చెప్పాడు. ఇంట్లో ఎక్కడా సంచలనం లేకపోవటం గమనించి తిరిగి వెంటనే పాతవూరు వెళ్లాడు."

కమల గజగజ వొణికి పోతోంది.

"వొట్టిది, అబద్ధం."

"కాదు కమలా సరీగా ఆలోచించు"

"అందువల్ల అతనికేం లాభం?"

"మీ మామ జైల్లో పడతాడు. మీ అత్త ఆ రాత్రి పాతవూరువెళ్లినట్లు పోలీసులికి ఆయన చెప్పనివ్వడు. మీ అత్త, రామనాధం, అంకరాజు పన్నిన కుట్ర సాగదని తెలుసును. ఆస్తి మీ అత్తకి దక్కదు. కాబట్టి కొంత ధర్మాలపరంకాగా కొంతైనా నీకు లభిస్తుంది."

"అయితే అత్తనే ఎందుకు చంపలేదు? చిన్న మామ నెందుకు చంపడం?"

"మీ మామ ఆస్తిలో ఏ కొద్ది భాగాన్ని కూడా మీ అత్తకివ్వడని తెలుసును. ఇంక ఇస్తేనీకూ, మీ చిన్న మామయ్యకీ ఇస్తాడు. రెండోవ్యక్తి ఉండడం కొంత నష్టం."

"మరైతే అత్త అతని గుట్టు బయట పెడతుందని అతనికి తెలియదా?"

"తెలుసు. కాని మీ అత్తా, అంకరాజు,

(30-వ పేజీ చూడండి)

13-12-50

## పక్షిరాజావారి

# “బీదలపాట్లు”



కథ: శుద్ధానందభారతి. కవి: వేదాంతం లక్ష్మీకాంతం. పాటలు: ఆరుద్ర, మహేశ్వర్.
సంగీతం: నాగయ్య, ఎస్. ఎం. సుబ్బయ్య, అశ్వత్థామ. డైరెక్షన్: కే. రాంనాథ్
నటులు: నాగయ్య, సీతారామన్, బాలయ్య, దొరరాజ్. శామ, కాళీఎన్ రత్నం,
లలిత, పద్మిని, రాజం వగైరా.



“Les Miserables” అనే ఫ్రెంచి నవల ఆధారంతో పక్షిరాజాస్టూడియోస్ వారు తమిళంలో “ఏళైపడుంపాడు” అన్న చిత్రం తయారుచేశారు. అది ఇటీవలనే విడుదలఅయి విజయవంతముగా నడుస్తున్నది. ఆ చిత్రానికే తెలుగుసంభాషణలు “డబ్” చేసి “బీదలపాట్లు” అన్న చిత్రం తయారుచేసి ఈ 7 వ తేదీన మద్రాసు మినర్వా థియేటర్లో ప్రివ్యూ ఇచ్చారు.

ఈ చిత్రానికి మాతృక అయిన విక్టర్ హ్యూగో నవల జగద్విఖ్యాతిగన్న రచన. దాని ఉదాత్తతకు భంగంకలగకుండా చూడడానికి కథకుడు చాలా ప్రయత్నంచేశాడు. ముఖ్యంగా పాత్రపోషణ విషయంలో చాలా శ్రద్ధవహించబడింది. అయితే కథ యొక్క వాతావరణం పూర్తిగా తగ్గుమాగాక, ఉడికీ ఉడకని అన్నంలాగా తయారయింది. మతగురువు మతగురువుగానే ఉంచబడ్డాడు. కాండిల్‌స్టిక్స్ ఉంచబడ్డాయి. ఇలా చేయటంచేత కథానాయకుడు కొండన్నను ప్రపంచమంతా నిరసిస్తుంటే ఈ రోజున కేథలిక్ మతగురువొక్కడే ఔదార్యం చూపాడన్న భావం కలుగుతున్నది. విక్టర్ హ్యూగో సృష్టించిన మతగురువు ఈ దేశపువాతావరణానికి తగడు. మన జాతీయతను నిర్మూలించి సామ్రాజ్యవాదులకు తోడ్పడడానికివచ్చిన మతప్రచారకులను తప్ప మన దేశం ఎరగదు. అదే విధంగా పోలీసు అధికారిపేరు జావర్ అని ఉంచటంకూడా అతగలేదు.

ఇంకొక విషయంలోకూడా అనుకరణలో చాలా పెద్దలోపం జరిగింది. మాతృకకథానాయకుడు ఖైదునుంచి తప్పించుకొని పారిపోయినవాడు. ఈ చిత్రంలో కథానాయకుడు జైలునుండి డిస్చార్జి పొందినవాడు. ఇందువల్ల కథానాయకుడిపట్ల ప్రేక్షకులకు మరింత సానుభూతికలుగుతుందని ఆలోచించారేగాని ఉత్తరోత్తరా కథ ఆయువుపట్టు దెబ్బతింటుందని గమనించలేదు. కథానాయకుడు కరుణాకరుడని పేరుపెట్టుకుని పరిశ్రమలు సాగించి భాగ్యవంతుడై నగరానికి మేయరై మానవసేవ చేస్తూ సుఖంగాఉన్న తరుణంలో ఇంకెవరినో పట్టుకొచ్చి కొండన్న అని ఆరోపించి మామిడికాయలు దొంగిలించినందుకు, మూడేళ్లపాటు తన జాడ పోలీసులకు తెలుపనందుకు విచారణ జరుపుతారు. అప్పుడు కరుణాకరుడు అక్కడికివెళ్లి తానే కొండన్ననని రుజువు చేసుకుంటాడు. కరుణాకరుడు ఈ పని చేయటంవల్ల రెండోముద్దాయికి కలిగిన పెద్దలాభం ఏమీ లేదు. మామిడికాయలు దొంగిలించిన నేరం అతనిపై ఉండనే ఉన్నది. కొండన్న పదేళ్లపాటు గౌరవనీయుడుగా బతికిన అనంతరం అతడు తనజాడ పోలీసులకు తెలుపక

(46-వ పేజీ చూడండి)



‘తన పేరున శిక్షపొందబోయే ఒక అమాయకుని రక్షిస్తున్న కరుణాకరుడు’—పక్షిరాజావారి ‘బీదలపాట్లు’చిత్రంలో నాగయ్యగారు.



“బీదలపాట్లు”లో లలిత

# తాసుపాము

(8-వ పేజీ తరువాయి)

పాములంటుంటేనే వొళ్లుగగిరిపొడుసుద్ది. అసువంటిది అసలవి నిజంగానే పొండుకునే అంతలావు పుట్టా, అన్ని బొక్కల కాడ-ఎచ్చగా లోనుంచి ఆవిరి కొడ్తుంటే- ఏ మడిసయినా ఆవజాన ఆడ వొంగి తొంగి సూత్తుంటం ఏ ఆడగూతురు కయినా ఎట్టుంటద్ది?

"ఒరేయ్?-" అని గుటక మింగింది ఎంకాయి.

నిశిరేత్రి, నిదర్లో ఎవురయినా వీడు సముంద్రాలుదాటి, మూడడవుల్ని వీటుకు నరికి, కుప్పేసి, నాలుగోఅడివి మయానుండ మర్రిసెట్టు తొర్రకాడ నిలబడి అరవకుండా తొంగి సూత్తుండే యవదానంలో- గబిక్కిన యీపుమీన పెటేమని సరిచి నిటారుగా కూకోబెట్టి నిదర్లేపుతే ఎట్టుంటదో అట్టయిపోయి- గబిక్కిన ఎనిక్కి ఒక్కగెంతేసి నిలబడి ఎంకాయిని సూశాడు బసవాయి.

"ఆఁయ్-?" అన్నాడు బసవాయి నోరు దెరిసి.

పల్లిక నెత్తిన బెట్టుకుని, కోకపైకెగ్గట్టి, ఆవజాన నోరు దెరుసుకు సూత్తుండె ఆ మడిసి గంగానమ్మతల్లనుకుండ బసవాయికి యింకూ స్పేపటికిగాని ఏంకాయి ఎంకాయికి మల్లే అగుపించలా.

మొన్నీమద్దె బెచ్చాలాట్లో తేలు కొండె జతో ఎగిరన్న ఎంకాయి వుండట్టుండి కోకెగ్గట్టె ఆవజాన ఆడ నిలబడేతలికి శాస బిగిసి గుటకమింగాడు బసవాయి.

"ఒరేయ్?" మల్లీ అంది ఎంకాయి.

"ఆఁ?-" అన్నాడు మైకం తీరగని బసవాయి.

"ఏందిరా నువుసేత్తుండదీ?" అడిగింది. ఎంకాయి.

"ఎవురూ- నేనా?- అయితే ఏంలే-" అంటున్నాడు బసవాయి.

"అయితే ఏంలే అంటాడేం!-" అంది ఎంకాయి.

"కాత్తె పనిమీనుండాలే-" అన్నాడు బసవాయి.

"అబ్బో కాత్తె సెప్పగూడ్డెట్టా ఆ పనేందో?" అంది ఎంకాయి.

"ఆఁ అదే అనుకుంటుండా-" అన్నాడు బసవాయి.

"అబ్బో మాటలు నేర్చావే నాయనా! యీడకి పొయినాయ్యా యిన్నాల మించీ" అంది ఎంకాయి.

"ఎట్టో పోయినాలే-"

"సరే, యిగనేం-" పల్లిక కిందపడేసి కూకుండది ఎంకాయి.

"నీతో నా కేందుకొచ్చింది, యివకాడ సానా పనుండదినాకు," అన్నాడు బసవాయి. ఏం పట్టించ్చుకోనట్టు పుట్టకాడ తిరుగుతూ.

"ఎవురొద్దన్నారూ, వుంటే చేసుకో రాదూ?" అంది ఎంకాయి,

"అసలు నువు యిటు ఏం పనిమీద వొచ్చినట్టూ?" అన్నాడు బసవాయి పాంబొక్కలోకి తొంగి సూత్తూ.

"ఒరేయ్, ఒరేయ్ ఏందిరా నువ్వాడ తొంగి శూసేదీ?" అంది ఎంకాయి వుండబట్టలేక.

"పాములే-" అన్నాడు బసవాయి అటనే తొంగిసూత్తూ.

"పాములీ! ఎందుకురా పాములు తొంగి సూట్టం? అవి మంచివికాదంటరా!" అంది ఎంకాయి,

"పనివుందిలే." అన్నాడు బసవాయి.

"ఏం పనిరా కాత్తెసెప్పవంట్రా?" అంది ఎంకాయి.

"పామునుపట్టుకుంటున్నాలే."అన్నాడు బసవాయి.

"ఆఁ, నిజంగా నట్రా! పోరా నీ బడాయిలు నాకాడంట్రా! నీలాంటోళ్లు యింగా పదిజనమలెత్తాల పామును పట్టుకుంటానికి." అంది ఎంకాయి.

"బడాయిలా? చూస్తావా మరీ పడ్తానో లేదో? హుఁ యీ బసవాయంటే అంతేననుకుండావుగావాల్సు,"

"యిగచాల్లే యివకాడికిరారా, పెద్ద పామును బట్టేమెగోడివి నేటిగ్గాంగా బయల్దేరావుగానీ. సానానూశాం యిట్టాటోళ్ళని. ఒరేయ్ ఎండ్రకాయలు పట్టుకోక ఎందుకొచ్చిందిరా నీ కాపనీ?" అంది ఎంకాయి.

"నువు సూశావా నే ఎండ్రకాయలు పట్టటం?"

"సూశానా యింగా సూశానా! హుఁ, నాకు తెలవక పోద్దిగా నీ సంగతీ," అంది ఎంకాయి.

"ఏందమ్మో నీకు దెల్చిందీ? శాపలుగదూ నేను పట్టుకునేదీ? కావాలంటే ఎల్లి అడుగు ఎవుర్నయినా."

"ఒరేయ్, సిన్నప్పుడు నువు ఎండ్రకాయల్ని పద్దాకా గెడ్డలు దీసుకుని కొట్టేవోడివి గావంట్రా?" అంది ఎకాయి.

"సిన్నప్పుడు నీకు తేలు కొండెకి మల్లే జడ వుండేదంటనే యిప్పుడది యాడకి పోయిందమ్మా?"

"ఓ బసవాయోవ్ నా చంగతెరగవు తెల్చిందా?"

"మరి యింకేం, అటనే అనుకోరాదూ నేనుకూడా. హుఁ, అంతలావు ఎగతాళిగా వుండదిగా!"

"అబ్బో మాటలు సానా నేర్చావే!"

"హుఁ, ఆడ నీకే మాటలొచ్చింది. నీ కన్న యీడ ఎవురేం తక్కువ తిన్నా- నాతో నీకెందుకొచ్చిందిగానీ యివకాడ సానాపనుండది నన్ను పలకరిచ్చమాక." అని మల్లీ పాంబొక్కలోకి తొంగిసూత్తుండాడు బసవాయి.

"ఒరేయ్,ఒరేయ్ బసవాయ్?"

"ఏం?"

"ఎందుకురా నీకు పాములజోలీ? అవి ఎసువంటివో నీకు తెల్చా?"అంది ఎంకాయి

"హుఁ, యీ బసవాయికి అన్నీ తెల్చు, యియ్యాల వైద్దికంలోకి గరగళం తెచ్చిత్తే అర్దరూపాయి డబ్బులిత్తా నన్నాడు రాంబెమ్మయ్య." అన్నాడు బసవాయి.

"గరగళం! గరగళంఏందిరా?"

"తాచుపాం గరగళం." అన్నాడు బసవాయి.

"తాసుపాం యిస మంట్రా! ఓమ్మో, అందుకంట్రా యీడ నువు తిరుగుతుండదీ?"

"బలే తాసుపాము లుండయిలే యీడ!" అన్నాడు బసవాయి.

"గెట్టిగా అరవమాకరా! నీకు నిజంగా శాతనవునంట్రా ఆట్ని పట్టటం?"

"హుఁ, అదొక లెక్కాజమా! మా అయ్యోళ్లు ఆట్ని మిడతల్ని పట్టుకున్నట్టు పట్టుకున్ని, నడిబజార్లో ఆట్ని మొల్తాళ్లుకట్టుకుని తిరిగేవాళ్లు!" అన్నాడు బసవాయి.

"ఆళ్లు పెద్దోళ్లురా. ఆళ్లు ఏం చేసినా చెల్లుద్ది. ఆళ్ళకాడ మంత్రకట్టుండే వంట."

"అంతావుత్తది. వుత్తధైర్నంమీద పట్టాల్సిందే ఎవురుపట్టినా."అన్నాడు బసవాయి

"నీకు ధైర్నం వుండదంట్రా?"

"ఎవరికి- నాకా? వుందో లేదో యిప్పుడు తెలుసుద్దిగా." అన్నాడు. బసవాయి.

"అద్దరూపాయి డబ్బులంట్రా రాంబెమ్మయ్య యిచ్చేదీ?" అంది ఎంకాయి.

"ఆడు అంతకన్నా యిచ్చిసావడు. సచ్చినోడి పెళ్లికి వొచ్చిందే సాలు."

* * *

"పానంకన్నా తీపంట్రా అద్దరూపాయీ? అసలు తాసుపాం ఎంత సెండాలపుదో నీకు తెల్చా? రాంబెమయ్య నిన్ను మాయ సేత్తుండాడ్రా." అంది ఎంకాయి.

"ఇదిగో ఎంకాయోవ్, అద్దరూపాయిలో నీకు పావలా బిల్లయిత్తా." అన్నాడు బసవాయి,

"సీ పాడూ - నాకేం అక్కర్లే ఎదవ డబ్బు-"

"నువు సిన్నప్పుడు ఓనాడు మనంకోతి కోజ్జీలాట ఆడుకుని యింటికి తిరిగొత్తా వుంటే సింతలతోపు కాడ నన్ను సాటుగా పిలిసి ఓ పావలా బిల్ల సంపాయిచ్చుకు రామంటివే?" అన్నాడు బసవాయి.

"అప్పుడంట్రా! పోరా నీ దంతా! అపుడు సెంచయ్య కొట్టోకి సబ్బిల్లలొత్తేనీ- ఆశబుట్టిందిరా- సీ పాడూ! అదెప్పుడో సిన్నప్పుళ్లేరా. ఇప్పుడు సబ్బిళ్లరుద్దుకుంటే మా జేజి సంపుద్ది." అంది ఎంకాయి.

అప్పట్నుంచీ ఎప్పుడిద్దా మనుకుండా ఓపావలా బిల్లన్నా సిక్కకుండా వుందే ఎంకాయ్" అన్నాడు బసవాయి.

"పోనీలేరా ఎదవ పావలాబిల్లా-"

"ఆఁ, అంతేనా! డబ్బంటే అంతసులకనగా తోసెయ్యమాకేవ్. యిగ్యాల బెమ్మదేవుడు దిగొచ్చినాచరే ఆ రాంచెమ్మయ్య దగ్గిర్నుంచి అద్దరూపాయిబిల్ల రావాల్సిందే నువు మాట్లాడమాక -|అంటూ పాంక్రా కొబ్బరిసిప్పా గెట్టిగా పట్టుకుని పాంపుట్ట కాడ కూకుండాడు బసవాయి.

"బసవాయ్?" పిలిసింది ఎంకాయి.

పాంక్ర వూత్తా నాగస్వరంపాట మైకంలో పడ్డాడు బసవాయి.

యాడా సలీ సప్పుడు లేదు. దూరాన గొర్రె పిల్లకాయలు బిల్లంగోడు కొట్టుకుంటూనే వుండారు. నాగస్వరానికి నిలబడి ఆడ్తుంటె తాసు పాములకిమల్లే నిటారుగా నిలబడుంటె తాడిసెట్లు గాలికిసల్లగా అటిటు కదులాడ్తుండయి.

బసవాయి మాట యినిపిచ్చుకునేట్టులేదు. యీడికి యిగ్యాల యిట్టా బుటిందేం? యీడు సిన్నప్పుడే నయం' కోతికోజ్జిలాట బలే అడేవోడు. ఎదవసచ్చినోడు ఒక్కపాలన్నా నన్ను దొంగను సేసే వోడుకాదు. మాలావు నాకేన్పా ఆ మాత్రం ఆట శాతకాందీ? ఆ పిచ్చాయోళ్లు బసవాయి నన్ను దొంగని సెయమని ఒకటే మయిన ఏడ్చేవోళ్లు, సీ పాడూ, ఆళ్లెప్పుడూ ఎదవ బుద్దేగందా! యిగ యిప్పుడేం వుంపెదీ? బసవాయి ఆట్లో కలవటమే మానేశాడు. ఎప్పుడు సూసినా ఏ డొంక ములు పుల్లోనో తిరుగుతావుంటాడు. యీ మద్దె యీడికి మనుసులంటేనే పట్టంలా. మనుసు లేం కరుత్తారా దగ్గిర కొత్తే? పావలాబిల్ల యింకా గాపకం పెట్టుకుండాడే! ఎవురికేం అక్కర్లా- ఆడిత్తానన్నా అక్కర్లా. సీ- డబ్బులడగటమేంగి పాడూ! అప్పుడెప్పుడో అడుగుతే యింకా గాపకంపెట్టుకుండాడే! నామీద ఆడికి నిజంగా గురివుండదా? ఏం పాడో...... యీడికే వన్నాగాలి పట్టలేదు గందా? రాంబెమ్మయ్య అద్దరూపాయి డబ్బులకి తాసు పాన్ని పట్టకుని యిసం పిండుతాడంట. యీడి అయ్యోళ్లుకూడా యిందేనంట. యింకేం యీడూ తయారయ్యాడూ! అద్దరూపాయ్! ఆ డన్నట్టు అద్దరూపాయంటే మాటలా! ఆ అద్దరూపాయుంటే ఏం కొన్నా కొనచ్చు- అయితేమటుకూ? పాములన్నా పట్టానంటం? పెమాదం గాదూ? ఒకోపాలి- సీ అనగూడదుగానీ- పానాలు గూడా పోతయి...అస లవి మనుసులుండే సోటికి అంతసులబంగా రావంటనే! యీడెంత పాంక్ర వూదుకున్నా అవి రాకుంటే సరి. అసలా పుట్టలో పాముండదో లేదో. వుంటే యింతసేపు రాకుండా వుంటదా? ఒకేళ అది బయిటికి వొత్తే యీడికి దాన్ని పట్టడం సరిగా శాతకాకపోతే? యింకా ఏమున్నా వుంపెదీ- "ఒరేయ్ బసవాయ్ యిగ సాల్లే రారా?" అంది ఎంకాయి.

బసవాయి ఎప్పుడో నాగలోకానికి పొయ్యాడు. ఎంకాయి యీడ కూకుండదని ఆడికి అసలు తెలవదు. పాంక్ర వూత్తా అటనే వూగుతుండాడు బసవాయి.

ఎంకాయి కళ్లు మెరిసినై- ఒక్కపాలి ఎనిక్కి యిగసుకుపడ్డది ఎంకాయి. పుట్టలోంచి తలతలతల మెరుస్తా జలజలజారి దొసెడు పడెగిప్పుకుని బసవాయి మొంగల తోక మీన నిలబడి వూగుతా ఆడ్తుండదా తాసుపాం. అటనే నేలకు నీలుక్కు పొయింది ఎంకాయి.

నిశిరేతి మెరుపు మెరిసి డామ్మని పిడుగు పడ్డట్టు-తాసుపాం తన మొంగల నిలబట్టం సూశాడు బసవాయి. ప్రాక్ర వూత్తానే- ఒక్కపాలి కళ్లు మూసుకుండాడు బసవాయి. బసవాయి గుండెల్లో ముళ్లు పొడిసినట్టు సూసింది తాసుపాం. ఒళ్లుజడిసింది బసవాయికి. మెడతిప్పి ఎనిక్కి తిరిగి సూశాడు- యిగ్రహానికి మల్లే నీలుక్కుబోయి గుడ్లిప్పుకుని సూత్తుండాది ఎంకాయి. మెడ బిగిసింది బసవాయికి.

సల్లగా సెయి ఒనుకుతా- పాంక్ర తాసుపాం పడిగ మీనకి పోనిత్తుండె బసవాయికి మద్దెలో నరాలు పటపట బిగలాగటాన పట్టుదప్పి ఎనిక్కి తూలిన తూల్టం ఎగ్గొగిసి గెంతేసి వుసిమీన ఎల్లి ఎంకాయి సెయి పట్టుకుని తాడితోపులోంచి బెయిటికి అదేమయిన లగెత్తాడు.

"యదవ సచ్చినోడా - పానం తీశావు గదంట్రా - యిదూ సెయ్యి-" అంది ఎంకాయి రొప్పుతూ.

"అరవమాకే-" అన్నాడు బసవాయి తాడితోపు కల్లి బిత్తరసూపులు సూత్తా.

"సెపితే యిన్నావంట్రా. ఒరేయ్ ఎక్కడ కాయలు పట్టుకోక ఎందుకొచ్చిందిరా నీకీపనీ-" అంది ఎంకాయి టపీమని కళాపి గొట్టినట్టు.

* * * *

ఆయాల్టినుంచి బసవాయి ఎంట పడింది తాసుపాం. పులిస్తరాకు లెగుస్తే తాసుపాం లెగుస్తున్నట్టుంటున్నది బసవాయికి. ఎవురన్నా గబగబ మాట్టాడుకుంటుంటే బసవాయి ఎంటికలు నిక్కబొడుసుకుంటుండై. సూర్లో తాడు, రోడ్డుమయాన, రోడ్డుపక్క తాళ్లను సూసి ఎనిక్కి ఎగ్గిరి గెంతేసి యీపు పరుసుకుంటుండాడు బసవాయి. కలలు కన్నాడు బసవాయి. గోడమొత్తలకాడ, గుడిసె సూరు సందుల్లో, శాంతాడు సుట్టమయాన తనను సూసి తాసుపాం 'బుస్సు' మంటూ పడిగ ఎనిక్కి తీసుకోటం ఎన్నోసార్లు కల్లోసూశాడు బసవాయి. తమాసా! ఓ నిశిరేతి ఎంకాయి తాసుపాముకు మల్లే 'బుస్సు' మంటం సూశాడు బసవాయి.

కొన్నాలకి ఓనాడు సందేల గొడ్డమందతో యింటికి తిరిగొత్తా తాడితోపులో ఆపుట్టకాడ గెడక్రకి మల్లే తాడిసెట్లలో కలిసిపోతా ఎవురో నిలబడుంటం మసగ్గా సూసింది ఎంకాయి. ఒక్కపాలిగా నిలిసిపోయింది ఎంకాయి. ముందుకుపోను ఎంకాయికి కాలాడలా సల్లగా మందనించి ఎనిక్కనిక్కి తగ్గి తాడితోపు కాడికొచ్చి సూసింది ఎంకాయి. నిజంగా ఆ పుట్టకాడ ఓ మడిసి నిలబడుండాడు. బసవాయి కాదు గందా? యిదేంది యీడికేవన్నా గాలి బట్టిందా: యీ యాలప్పుడు ఒంటరిగా ఆడ నిలబట్టానికి ఎంతదైర్నంవుండాల?

మసగలో తడువుకుంటూ పుట్టకాడికొచ్చి- ఒక్కపాలికేక బెట్టి అటనే నోరు దెరిసి కొయ్యకి మల్లే నిలబడిపోయింది ఎంకాయి.

ఆ తాసుపాం బసవాయి మెడా, సెయీ బిగదీస్తుంటే, దాని మెడకాడ పట్టుకుని గొబ్బరి సిప్పలోకి దాని యిసం పిండుతుండాడు బసవాయి.

దైర్నంగల మొగోడు గుండె బిగువు మీన డెబ్బయి గజాల ఎత్తయిన దొజత్తంబం

మీనకు ఒక్కొక్క జరుగే జరుక్కుంటా ఎల్లుండే యవదానంలో ఒకావిడగూతురు గుండెబెడిసి ఒక్కపాలికేక పెట్టేతలికి అంత దైర్నంగల మొగోడి గుండెబిగువూ కుండ పగిల్నట్టు పగిలి, నరాల పట్టుతప్పి నెవటలు గక్కుతా గిరగిర తిరుగుతా దబ్బున బూమ్మీన పడ్డాల్సిందన్న మాట!

గబిక్కున ఎనక్కితిరిగి నూశాడు బసవాయి వూపిరి బిగబట్టి.

"ఎవ్లు-" అన్నాడు బసవాయి దవడలు కరుసుకుంటా.

"ఓమ్మో-" మూలిగింది ఎంకాయి.

పొట్టలిచ్చిన పత్తికాయలకి మల్లే ఎంకాయికళ్లు బసవాయిగుండెలమీనదిగినై.

"ఎల్లిపో- మల్లీ ఎందుకొచ్చా యీపక్కి? నా సెయి జార్తుండది-ఎల్లిపో అరవకుండా-"

"అరవన్లేరా- ఒరేయ్- ఒరేయ్- నిన్ను సంపుద్దిరా- దాన్ని సంపరా-" మూలిగింది ఎంకాయి.

తాసుపాంకల్లి నూశాడు బసవాయి. తాసుపాం రఖితం గక్కుతా పటపట గొబ్బరి సిప్పను కొరుకుతా వొనుకుతుండ సెయి సుట్టూ మెల్దిరుగుతుంటే- ఒక్కపాలి గట్టిగా నరాలు బిగబట్టి, ఎంకాయి కల్లి కొరకొర నూత్తా సువ్వకి మల్లే మెల్దిరిగి వుసిమీన తాడిసెట్ల సీకట్లోకి గబాగబా లగెత్తు కెల్లాడు బసవాయి.

మరుస నాట్నుంచి జరంలో మతుండక మంచంలో పడుండాడు బసవాయి. "వాడికేం రాయిలాంటి మనిషి." బసవాయికేం ఫరవాలేదన్నాడు ఎంకాయితో వైద్దికుడు రాంబెమ్మయ్య.

కొన్నేళ్లు గడిసినాక ముగ్గురు బిడ్డల్తో పుట్టింటికి తిరిగొచ్చిన ఎంకాయిని తాడితోపుసాయల్న "ఏం ఎంకాయమ్మోవ్?" అని బసవాయి పలకరిచ్చేదాకా బసవాయిని ఎంకాయి పోల్చుకోలేక పోతోంది.

"సంపావు గదంటయ్యా బసవయ్యా! పోల్చుకోనే లేకబోతినే నా తెలివి పాడుగానూ! బాగుండావంటయ్యా? బొత్తిగా గురుతు పట్టకపోతినే!" అంటా బసవాయిని యిశారించింది ఎంకాయి.

"చరే, పెగ్గోణ్ణయిపోటంలా! నీకుముగ్దురు బిడ్డలంటగా బాగుండారా?" అన్నాడు బసవాయి.

"ఆ, బాగుండారయ్యా బసవయ్యా. పెద్దోడిపేరు ఆళ్లతాతపేరు పెట్టుకుండారూ, రెండోవాడిపేరు ఎంకటేశ్వర్లు, మూడోదాని పేరు చీతాం." అంది ఎంకాయి.

"నువ్వూ కొత్త పెద్దదానివయినా మడిసివి అంతగా మార్లేదులే." అన్నాడు బసవాయి పక్కకి తిరిగి వుమ్మేస్తా.

"ఏబ్బే, అదేందయ్యా యింగా పెద్దదాన్ని కాలేదంటావు ముగ్గురు బిడ్డలయితేని! యింగా నయం! నువు పెద్దోడివయ్యావు. సానాసన్న బడ్డావు." అంది ఎంకాయి.

"కొత్త మద్దెమద్దె వొల్లు సెత్తావొచ్చిందిలే- సానా ఏళ్లు కాలా మరీ-" అన్నాడు బసవాయి.

"సానా ఏళ్లయింది." అంది ఎంకాయి.

"అంతా నిన్న మొన్న జరిగినట్టుంది." అన్నాడు బసవాయి.

దూరాన గొడ్డు ఆ డీడ గనువు లెంట తిరుగుతుంటే గొడ్డపిల్లకాయలు బిల్లంగోడు ఆడుకుంటుండారు

"బలే బతుంబుట్టింది." అంది ఎంకాయి.

"నువు కోక పైకెగ్గట్టుకుని ఎనిగిత్తే వొచ్చి ఆడ నిలబట్టం యింగా కల్లల్లో మెదుల్తుండది." అన్నాడు బసవాయి.

"ఎట్టా పట్టుకుండా ఆ తాసుపామునీ- సివరకి ఏం జేశా దాన్ని? నువ్వామయిన లగెత్తుకు పొయినాక అడలుబుట్టి సచ్చా. యీడజూసినా అగుపించలానువ్వు."

"ఆ మూలకిపొయి, దానియిసం పిండి తల నేలకేసి రుద్దిరుద్ది సంపేశా," అన్నాడు బసవాయి.

"ఓమ్మో!" అనరిసింది ఎంకాయి.

"అదిగో- ఎంకాయోవ్-"

"బలేబయం పుట్టిందిరా బసవాయ్-"

"సంపేత్తివి గదంటే ఎంకాయ్-"

"అదేంది బసవయ్యా ఎనకటికిమల్లే ఒరే, ఒరే అంటుండానూ- చీ, సచ్చిందాన్ని- యిదేంమడిసినీ- యిహి, యిహి-" అంటా ఎంకాయి నవ్వుతే బసవాయీ నవ్వాడు "అంటే అన్నావులే" అంటూ.

"సివరికి రాంబెమ్మయ్య ఆల్చెం అయిపోయిందని గరగళానికి అద్దరూపాయి బిల్లయీయనే యీయలేదుగా." అన్నాడు బసవాయి.

"అరి యీడిజిమ్మడా- నిజంగా యీయనే యీయలా?" అంది ఎంకాయి.

"అబ్బే నీతోడు యీయనే యీయలేదుగా. యిత్తేనీకు పావలాబిల్ల ఎప్పుడో యీయక బొయ్యేవాణ్ణా!" అన్నాడు బసవాయి.

"అదేంది బసవయ్యా యింగా పావలా బిల్లంటుండావూ-?"

"అంటేఏంలే. మాటన్నాక యీయకనే బోతినిగా."

"పోనీలే బసవయ్యా- అందరూ బాగుంటే అంతేసాలు."

"అంతేలే ఎప్పటికయినా-" అన్నాడు పక్కకుతిరిగి వుమ్మేస్తా.

"మా పిల్లల్ని నూశావంటయ్యా బసవయ్యా?"

"ఏదీ నువు సూపియ్యకనే బోతివిగా."

"బలేవోడివిలే! అనక మాయింటికొస్తే తప్పేట్టా?" అంది ఎంకాయి నవ్వుతా.

"ఓ బసవయ్యోవ్, ఓ ఎంకాయమ్మోవ్ కొత్త ఓ పాలియిటొచ్చి పోండయ్యా మీ మడుసులు బంగారంగానూ?" అని ఒక్కపాలరిశారు బిల్లంగోడుకాడ తిను వొచ్చిన గొడ్డపిల్లకాయలు.








# చందూ వెంకు సాహసము


కొంచెము
ఆగుదాము


త్వరగా వెనక్కు రా
రైలు వస్తోంది!


అయ్యో కాలికి దెబ్బ
తగిలింది, చందూ,
సహాయము చెయ్యి.




భలే, చందూ,
నీవే ధైర్యశాలివి.


ఎంతదుర్దినమిది! ఇప్పుడుశుభ్రతకు హమాము
సబ్బుతో స్నానముచెయ్యండి! "రక్షణప్రథమ
కర్తవ్య" మనేమాట
ఎప్పుడూ మరవకుడు

# దాగినద్వేషం

(23-వ పేజీ తరవాయి)

షావుకారు పన్నిన కుట్ర ఒకటుందిగా. ఇది బయట పెడితే, అది అతను బయట పెడతాడు."

"అందులో అతనికీ చెయ్యి ఉందంటున్నారుగా."

"ఉంది. కాని ఉందని ఎవరు నిరూపించగలరు?"

"రామనాథం ఈ పని చేసివుండకూడదూ?"

"చేసిన వాడయితే ఆ రాత్రి తన చెల్లెలు అంకరాజింటికి వెళ్ళిందని మొన్నటి రోజున పోలీసులికి ఎందుకు చెప్తాడు? చెప్పనందువల్ల తన చెల్లెలికి పైసా దక్కదని అతనికి తెలుసును. అదీకాక ఆ కత్తి ఎక్కడవున్నదీ అతని కెలా తెలుసు? నువ్వు నిద్రలో లేచి తిరుగుతున్నట్టుకూడా అతనికిగాని, సత్యనారాయణకిగాని తెలియదు. పార్వతమ్మగారికైనా నువ్వు నిద్రలో లేచి తిరుగుతున్న సంగతే తెలుసును కాని, తాళం చెవులు పూలకుండు కింద పెడుతున్న సంగతి తెలియదు. లేక నువ్వెప్పుడైనా చెప్పిఉన్నావా? రామచంద్రరావు చెప్పివుంటాడా?"

"లేదు. అత్తకి తెలియదు. అతను చెప్పలేదు"

"చెప్పలేదని నీకెలా తెలుసు?"

"అత్తకి చెప్పివున్నట్లయితే ఆరాత్రి ఆమె అంతభయపడేదికాదు. నా గదిలో పడుకోటానికి కూడా సిద్ధపడింది. కాని చివరకి అన్నతో కలిసి ముందు గదిలో పడుకుంది."

"అదీ అతనిసలహాపైనే కాదూ?"

కమల జవాబు చెప్పలేక పోయింది. కాని అది అవసరం లేకపోయింది. ఇంతకాలమూ అతని సహాయం పైనేనా తాను ధైర్యం చిక్కబట్టి రోజులు గడుపుతున్నది! ఈ తలపుతో కమలకి బ్రతుకంతా అంధకారమయమై పోయింది. ఆ పాదమస్తకం కంపించిపోయింది.

మాధవరావు ఆప్యాయంగా ఆమె వెన్ను తట్టాడు.

"ఫరవాలేదులే. విశ్రాంతి తీసుకో. మీ మామయ్యా ఈ రాత్రి స్వేచ్ఛగా మీ యింట్లో తిరుగుతున్నాడు - నిద్రలో కాదు, నీకోసం నిరీక్షిస్తున్నాడు ఆయనకి ధైర్యంచెప్పడానికి నువ్వే మిగిలావ్. వెళ్లు."

కాని కమలకి కాళ్లాడలేదు. ఇంతలో ఇంటిముందు జట్కా ఆగిన చప్పుడయింది. ఒక యువకుడు చేతిలో తోలుబాగ్‌తో వచ్చాడు. మాధవరావు ఆహ్వానిస్తూ "రావోయ్. ఎక్స్‌ప్రెస్ ఈ పూట ఆలస్యమయింది కాబోలు నువ్వు వచ్చేసరికే ఇక్కడ పనంతా పూర్తయింది. పత్రాలతో నిమిత్తం లేకుండా అన్నీ పరిష్కారమైనాయి. రేపే మన ప్రయాణం. ఈ అమ్మాయిని నువ్వు చూశావుగా. మామా మేనకోడలూ నిరాధారంగా ఉన్నారు. ఉండగలిగితే రేపు నువ్విక్కడే ఉండిపో."

జూనియర్ వకీలురంగారావు తెల్లబోయి చూశాడు.

ప్రాసిక్యూటర్ గుఱ్ఱు ఆగిపోయింది. కళ్లు నులుముకు "మళ్లీ ఏంకథ?" అన్నట్లు చూశాడు. [సమాప్తం]

# విశాలాక్షి

(20-వ పేజీ తరువాయి)

ఆ కాగితంమీద రెండుపంక్తులు. నా కళ్లను పడ్డాయి. ఈ నాటికి ఆసూదులు పూడదీయడానికి వీలుగాకుండా గ్రుచ్చుకున్నాయి. విశాలనాన్నగారి పేర, విశాలఅమ్మగారు నేను కంటబడగానే ఉత్సాహంగా ఉంటుంది. అనే సూచనఉంది అందులో.

ఏదయితే చూడకూడదో, ఏదయితే వినకూడదో, ఏదయితే చెప్పకూడదో నా కది ఎదురయింది. ఎలాగ ఇప్పుడు? ఏంచెయ్యను విశాల, విశాలనాన్నగారు ఈ మాట తెలుస్తే- లోకులు చేసిన ఈఇంద్రజాలం ఆయన కంట పడితే- అప్పుడే పడిందేమో! నన్నాయన మళ్లీచూస్తే- నేను ప్రాణాలతో నయినా బయటపడగల్గుతే- ఆయన్ని అంత సౌమ్యుణ్ణి—ఎంత గాయపడ్డాడో! ఎలాగ?

విశాలఅమ్మగారుకూడా అక్కడే ఉన్నారు.

"ఈ కాగితంమీద ఒక బిందెడు నీళ్లు పొయ్యండి." అన్నాను. లేకుంటే అందులోని విషజ్వాల ఎందర్ని భస్మం చేస్తుందో అన్నభయంతో.

ఆమె గబగబా నిప్పును ఆర్పినట్టుగా ఆ కాగితం మీద నీళ్లుపోసింది ముక్కలు ముక్కలుగావేసి దాన్ని మట్టిలో వేసి కాలరాచాను.

విశాలతో నా పరిచయంకూడా ఈ కాగితం ముక్కలవలెనే ముక్కలయి కాలగర్భంలో కలిసిపోయింది.

విశాల నాన్నగారు సికింద్రాబాదు బదిలీ కోరారు, ఆరోగ్యకారణాలమీద. రెండు రోజులలో సిద్ధంగా ఉండాలి ప్రయాణానికి. ప్రయాణానికి సన్నాహాలు చేస్తున్నారు. నాకు తోచిన సహాయం నేను కూడా చేశాను. వారిని వారిసామగ్రితో రైలెక్కించి రైలు కదిలిపోయేవరకు ఉండి కదిలిపోతున్న రైలులో వారికి చెంబుతో మంచినీళ్లు అందించి నేను వెనక్కి నిలిచిపోయాను. అప్పుడు నా కనరయినా మంచినీళ్లు ఇస్తే బాగుండునని పించింది.

విశాలమాత్రం అంటూంది. "మీరు సికింద్రాబాదు రావాలి సుమండీ!" అని. నా కళ్ల ఎదుట పిందె తెగిపోయిన మామిడి పిందెల గుత్తి కనబడ్తున్నది.

ఏడాదికిందట విశాల ఎవరో నాకు తెలీదు. ఏడాదిపాటు ఎవరికోసూ ఏ పరిచయమూ లేకుండా నేను హాయిగా ఉన్నాను. ఈ విశాల నాజీవితంలో ఎంత ఆశ్చర్యకరంగా ప్రవేశించిందో అంత ఆశ్చర్యకరంగా నిష్క్రమించింది. విశాలాక్షి విశాలమయిన కళ్లుగల విశాలాక్షి. పదకొండేళ్లయినా నిండని అంత చిన్నపిల్ల తన చేతి చిటికెన వేలితో నన్ను నాఆశల్లోంచి, ఆశయాల్లోంచి, ప్రేమల్లోంచి, ప్రణయాల్లోంచి, ఆనందతరంగాలమీంచి తేలించుకొనిపోయిన దేవతవలె అవతరించింది. తన విశాలమయిన నయనాల్లో నన్ను ఉయ్యాల లూగించింది.








<u>బాలగేయాలు:</u>

## సందేశం

సరిగమ పదనిస
సంగీతం -
శాంతీ సౌఖ్యం
సందేశం -
అ ఆ ఇ ఈ
అభ్యాసం -
మంచీ మన్నన
సమ్మానం -
చెడుగుడు కోకో
సంతోషం -
పుష్టీ తుష్టీ
సంభారం -
చుక్కల ముగ్గుల
సింగారం -
అక్కా చెల్లెలి
బంగారం -
భారతభూమీ
మాదేశం -
పాటా, మాటా
సంపూర్ణం -
తారకు అవ్వకు
జేజేలూ -
కన్న భూమికీ
జేజేలూ -

## పాడిపంటలు

శ్రీమతి మైత్రి

కడలి నీరు
కడుపు నిండ
తాగి వచ్చెనూ
మబ్బు
దండు వచ్చెనూ -

మబ్బు చూసి
దుబ్బు నరికి
వల్లు వంచెనూ
రైతు
మళ్ళు చేసెనూ,

కొండమీద
కుండపోత
వాన కురిసెనూ
ఏరు
తాన మాడెనూ

ఏరు చూసి
కోడెగిత్త
రంకె వేసెనూ
రైతు
గుండె పొంగెనూ.

గట్టు నరికి
పుట్ట నరికి
చదును చేసెనూ
పొలము

పదును చేసెనూ
గళ్లు తీసి
మళ్లలోకి
నీళ్లు పెట్టెనూ
రైతు
తళ్లు పెట్టెనూ

నారునాటి
నీరు పెట్టి
గట్టులెక్కగా
కాల
మిట్టె గడిచెనూ

పచ్చ మొక్క
పెరిగి పెరిగి
పండి వరిగెనూ
పిడికె
పంట వచ్చెనూ

కోత కోసి
కుప్ప వేసి
నూర్చి తెచ్చెనూ
రైతు
గాదె నింపెనూ.

పాడి పంట
కొదువ లేక
పిల్ల పాపలూ
సదా
చల్లగుండిరీ

(పటమట - విజయవాడ - బాలబాలికల 'మహాసంఘం' వారు ఈగీతాలను కోరటం చేస్తూ గానం చేయుటంలో తర్ఫీదు పొందారు. బాగా ప్రచారంలో వున్న వారి పాటలలో యివి రెండు)



# ముగ్గురు వీరులు

అనగా అనగా ఒక ఊళ్లో ధనుర్ధరుడు అనే ఒక గొప్ప విలుకాడు ఉండేవాడు. అతనికి డబ్బు బాగా ఉంది. మరో పనేదీ లేదుకూడా. అందుచేత అతను యిరవైనాలుగు గంటలూకూడా విల్లు పుచ్చుకుని తన భార్యమెడలో ఉన్న ముత్యాల హారాన్ని రాసుకుపోయేలాగా గురి చూసి కొడుతూ ఆవిధంగా తన గురిని సాధకం చేస్తూండేవాడు. ఆవిడ ఆ బాణం గురి తప్పి ఎక్కడ తనకు తగులుతుందోఅని నిత్యమూ భయపడుతూండేది.

ఇలా ఉండగా ఒకసారి ఆమె, పక్కింటివాళ్లతో చెప్పుకుంది, "చూడమ్మా, మావారు యిరవైనాలుగుగంటలూ యిలాగ నామెడకేసి బాణాలు గురిపెట్టి కొడుతూనే ఉంటారు. ఏ క్షణాన ప్రాణం పోతుందోకూడానూ. ఆయనకి చెలగాటంగా ఉంటే నాకు ప్రాణసంకటంగా ఉంది" అని.

అది విని ఆ పొరుగింటావిడ కాస్త తెలివైనది కావడంచేత, "ఇదిగో, ఈసారి ఆయన నీ మీద బాణా లేస్తూండేప్పుడు నువ్వు, "మీరే గొప్పవాళ్లనుకుంటున్నారుకామోసు. మిమ్మల్ని మించినవాళ్లు ఈ దేశంలో చాలామంది ఉన్నారు" అని చెప్పు. అంతా చక్కబడుతుంది." అని సలహా యిచ్చింది.

'రాజా'

మర్నాడు ధనుర్ధరుడు యథాప్రకారంగా బాణాల్ని కొట్టడానికి వచ్చినప్పుడు అతని భార్య చెప్పింది. "ఇదుగో, ఈ దేశంలో ఇంకా చాలా చాలా గొప్పవాళ్లున్నారు తెలుసా? వాళ్లందర్నీ ముందర జయించిరండి. ముత్యాలహారాన్ని కొట్టడం ఏమీ గొప్పపని కాదు" అని.

అతను వెంటనే ఆశ్చర్యపడి, "ఇదుగో, నే నిప్పుడే వెళ్లి వాళ్లని చూసివస్తాను." అని చెప్పి, తన విల్లూ, బాణాలూ పుచ్చుకుని బయలుదేరాడు.

'బ్రతుకు జీవుడా!' అని అతని భార్య నిట్టూర్చింది.

ధనుర్ధరుడు అలా వెళ్లగావెళ్లగా ఒక సత్రం కనిపించింది. అతను అందులో కూర్చుని విశ్రాంతి తీసుకుందామని అనుకునేలోగానే అతని దగ్గిరకి ఒక కండలు మెలితిరిగిన వస్తాదొకడొచ్చి కూర్చున్నాడు. ధనుర్ధరుడు అతన్ని, "అయ్యా, ఎవరు మీరు? ఎందుకిలా తిరుగుతున్నారు?" అని అడిగాడు.

ఆ వస్తాదు వెంటనే తన జబ్బలు కొట్టుకుని, "నేను ఎవరితోనయినా సరే కుస్తీపట్టగలను. ఎంత బరువులయినా సరే ఎత్తేస్తాను. ఇలా ఉంటూండగా నాకు ఈ దేశంలో యింకా ఎంతోమంది విద్వత్తు ఉన్నవాళ్లు వున్నారని తెలిసి వాళ్లని చూద్దామనే కుతూహలంతో బయలుదేరాను" అన్నాడు.

ధనుర్ధరుడు వెంటనే తను వచ్చిన పని కూడా చెప్పి, "అయితే మన మిద్దరం స్నేహితులం. ఇంకావేమేమి విచిత్రాలుచేసే మనుషులున్నారో చూద్దాం." అన్నాడు.

ఇలా వాళ్లు బయలుదేరగా ఒకచోట ఒక పండితుడు కనిపించాడు. వీళ్లు అతన్ని వెంటనే, "ఏం పని మీద వెడుతున్నారు?" అని అడిగారు.

ఆ పండితుడు ఒకసారి పిలక ఝాడించుకుని, "నేను యుక్తిప్రజ్ఞుణ్ణి. ఎలాంటిదాన్నయినాసరే యుక్తులతో తిరగగొట్టగలను;

యుక్తులతో తెలుసుకోగలను." అన్నాడు.

ధనుర్ధరుడూ, వస్తాదూ వచ్చిన పనికూడా తెలుసుకుని, ఆ పండితుడు తన యిల్లు దగ్గిర్లోనే ఉండడంచేత వాళ్లని తన యింటికి తీసికెళ్లి కడుపునిండా భోజనం పెట్టించాడు.

ఆ రాత్రి అంతా పడుకున్నాక వస్తాదు గమ్మత్తుచేద్దామని యిల్లు అంతా వెదికాడు. ఒకమూల ఒక పెద్ద యినప బూర్లె మూకుడుంది. అది యిరవై ముప్పైమంది సాయం పడితేనేగాని కదలనే కదలదు. వస్తాదు వెంటనే దాన్ని పుడకని ఎత్తినట్టు ఎత్తి, గబగబా వెళ్లి అక్కడ ఒక చెరువుంటే అందులో పారేసి మళ్లా వచ్చి, ఏమీ తెలియనట్టు పడుకున్నాడు.



పండితుడు తెల్లారకట్టే లేచాడు. చూస్తే అంత పెద్ద యినప బూర్లె మూకుడూ మాయమయిపోయింది. ఆ పండితుడు యుక్తులెరిగినవాడు గాబట్టి బయట తడిఅడుగులు మట్టిలో చూసి, వేళ్ల ముద్దరలని బట్టి ఆ వస్తాదే తీసి ఉంటాడని, చెర్లో పారేసివుంటాడని తెలుసుకున్నాడు.

మర్నాడు ప్రొద్దెక్కాక అందరూ లేచారు. పండితుడు వాళ్లని స్నానానికని చెరువుదగ్గిరకి తీసికెళ్లి వస్తాదుతో "అయ్యా, ఆ మూకుడు యిందులో పడేశారు. అది తీసియిస్తారా?" అన్నాడు. వస్తాదు బ్రాహ్మడి యుక్తికి తెల్లబోయాడు.

తరవాత కూరలకని పండితుడు వస్తాదుని పిలిచి, "అయ్యా, మీరు ఆ కొండదగ్గిర ఉన్న బీరకాయల్ని తెండి. కూరవండుకు తిందాం." అన్నాడు. వస్తాదు సరేనని చెప్పి బయలుదేరాడు.

ఇంతట్లో ఆ కొండపై ఉన్న పిశాచం ఒకటి యిదంతా తెలుసుకుని ఒక ఏనుగంత బీరకాయ రూపంలో ఆ కొండమీద తయారయింది. వస్తాదు ఇది చూసి, "ఎన్నో బీరకాయ లక్కర్లేకుండా ఒక్క బీరకాయతోటే అందరికీ సరిపోతుంది." అని సంతోషించి ఆ బీరకాయని తీసుకువచ్చాడు.

పండితుడు దూరంనించే వస్తాదు చేతిలో అంత పెద్ద బీరకాయని చూసి ఏ పిశాచమో మోసం చేస్తోందని వెంటనే, "ఓ తెలివి తక్కువదద్దమ్మా! ఇంతా చేసి ఒక చిన్న పిశాచాన్ని తెస్తే ఏం లాభం? దీంతో మనకి ఒక్క గుటకయినా వెళ్లదే?" అన్నాడు. వస్తాదు కేమీ బోధపడలేదు. ఇంతట్లో ఆ బీరకాయలోంచి పిశాచం వచ్చి, "రక్షించండి! అపరాధం! తెలియక చేశాను." అని పండితుడి కాళ్లమీద పడింది.

పండితుడు, "సరి, నువ్వొస్తే మాత్రం ఏం కడుపు నిండుతుంది? సరేగాని, నిన్నొదిలిపెడితే ఏం తెస్తావు?" అని అడిగాడు దాన్ని.

అది వణుకుతూ, "మీకు క్షణంలో వజ్రాలూ వైడూర్యాలూ తెస్తాను." అని చెప్పి, బ్రతుకుజీవుడా అని పరిగెత్తింది.

ఆ పిశాచం అలా వెళ్లి వజ్రాల్ని తెస్తుంటే మిగిలిన పిశాచాలన్నీ దగ్గిరకి వచ్చి, "ఏమిటిది? ఏమిటి సంగతి?" అని అడిగాయి. అది భయంగా, "అక్కడెవరో

(39-వ పేజీ చూడండి)




టామ్ ఒక నిశ్చయానికి వచ్చేశాడు. ఈ ప్రపంచంలో తనకి 'నా' అనేవారు లేరు. ఎవ్వరికీ తనంటే ఇష్టం లేదు; ప్రేమ లేదు. ఏదో తనదోవన తాను పోతూ అందరిచేతా మంచివాడనిపించుకోవాలని ఎంతో ప్రయత్నించాడు. కాని వాళ్లు తన్ని మంచిగా ఉండనిస్తేనా? సర్లెండి. వాళ్లకే తెలిసి వస్తుంది ఎప్పటికో. తమమూలాన ఎంత మంచికుర్రాడు ఎల్లా చెడిపోయాడో వాళ్లకే తెలుస్తుంది. వాళ్లకి తను అక్కర్లేదు. అందుచేత తను వాళ్లకి దూరంగా పోతాడు. సముద్రపు దొంగ అవుతాడు. బోలెడన్ని ఘోరమైన నేరాలు చేస్తాడు. అంతకంటే మరోమార్గం లేదు.

టామ్ స్కూలునించి బయల్దేరాడు. ఎక్కడికి పోతున్నాడో అతనికే తెలియదు. దూరంనించి మధ్యాన్నం స్కూలుగంట వినిపిస్తోంది. ఆ గంటని మళ్లీ తను వినడు కదా! అందరూ కలిసి కుట్రచేసి తనని తరిమేస్తున్నారు. అయినా వాళ్లని తను క్షమించాడు. ఈ క్షమించడం దగ్గిరకొచ్చేటప్పటికి టామ్‌కి ఏడుపాగిందికాదు.

ఎదురుగా ప్రాణస్నేహితుడు జోహార్పర్ కనిపించాడు. జోకూడా టామ్‌లాగానే విచారంగా వున్నాడు. టామ్ చొక్కాతో కళ్లు తుడుచుకుని వెక్కి వెక్కి ఏడుస్తూ జోతో చెప్పాడు, తను యింటిదగ్గిర్నించి పారిపోతున్నానని, వెనక్కి తిరిగిరానని. తనని జ్ఞాపకముంచుకోమని జోని కోరాడుకూడా.

కాని ఆశ్చర్యమేమంటే- జోకూడా టామ్‌తో అదేవిషయం చెప్పటానికి వెదుక్కుంటూ వచ్చాడు. మీగడ తిన్నందుకు జోని వాళ్లమ్మ బాదింది. ఈ పీడా విరగడైతే బావుండు ననుకుంది. తను తన అమ్మకే పీడగా వుంటే అక్కడ వుండట మెందుకు? తను వెళ్లిపోతే ఆవిడ సుఖపడుతుంది. అందుకని జోకూడా పారిపోవటానికే నిశ్చయించాడు.

ఇద్దరు మళ్లీ కళ్లు, ముక్కులూ తుడుచుకున్నారు. ఇద్దరూ ఒకళ్లనొకళ్లు విడిచిపెట్టమనీ, చచ్చిపోయేదాకా కలిసివుంటామనీ ప్రమాణం చేసుకున్నారు. జో తనకి మునీశ్వరుడిలాగా అడవిలో తపస్సు చేసుకోవాలని ఉందన్నాడు. కాని టామ్ సముద్రపు దొంగల గొప్పతనాలని వర్ణించేటప్పటికి జో తనుకూడా సముద్రపు దొంగ కావటానికి అంగీకరించాడు.

టామ్ స్వగ్రామమైన సెంట్ పీటర్సుబర్గ్‌కి మూడుమైళ్లు దిగువగా మిసిసిపీనది రెండుపాయలుగా చీలుతుంది. ఆ మధ్యలో పొడుగాటి ద్వీపం ఒకటుంది. ఆ ద్వీపంనిండా దట్టమైన అరణ్యాలున్నాయి. అక్కడ తమ నివాసం ఏర్పరుచుకోటానికి ఇద్దరూ నిశ్చయించారు. అక్కడికి జనం ఎప్పుడూ రారు. దానిపేరు జాక్సన్ ద్వీపం.

తరవాత ఇద్దరూ కలిసి హకల్‌బెరీఫిన్‌ని వెతికి పట్టుకున్నారు. వాడికి ఏ వృత్తిఅయినా ఒకటే. అందుచేత పిల్లల ప్లాను వినీవినగానే

'రైటో' అన్నాడు. ఊరికి ఎగువగా రెండుమైళ్లదూరాన ఒకచోట అర్థరాత్రివేళ ముగ్గురూ సమావేశమవటానికి ఏర్పాటు చేసుకున్నారు. చేపలు పట్టే గాలాలు, ఇంకా అవసరమైన ఇతర చిల్లరవస్తువులు దొంగతనం చేసైనాసరే తేవటానికి కూడా ఏర్పాటుచేసుకున్నారు. ఇక ముందు ఎల్లాగూ దొంగతనాలు చెయ్యాందే గడవదు గా[illegible] అది ఇప్పుడే మొదలుపెడితే సరి.

సాయంత్రమయ్యేసరికల్లా టామ్, జో, హాక్ ముగ్గురూ కనిపించిన అడ్డమైనవాడికీ చెప్పేశారు, "రేపు తెల్లారే టప్పటికి ఒక గొప్ప విషయం జరుగుతుం" దని ప్రతివాడికీ రహస్యంగా చెవులో ఈ ముక్కలు చెబుతూ "ఎవ్వరితోనూ చెప్పకు" అని ఒట్టువేయించుకున్నారు.

అర్థరాత్రికల్లా టామ్ తినుబండారాలు మూటకట్టుకుని అనుకున్నచోటికి వచ్చాడు. ఒక పొదలో దాక్కున్నాడు. అంతా నిశ్శబ్దంగా వుంది. నక్షత్రాల గుడ్డివెలుతురు తప్ప మరే వెల్తురూ లేదు. నదిలో కెరటాలుకూడా నిద్రపోతున్నట్టున్నాయి. టామ్ నెమ్మదిగా ఈల వేశాడు ఆ యీలకి సమాధానంగా మరొక ఈల వినిపించింది. టామ్ మళ్ళీ రెండుసార్లు ఈల వేశాడు. రెండుసార్లు జవాబులు వచ్చాయి.

"ఎవరక్కడ?" అని ఒక గొంతుక కేకవేసింది.

"టామ్‌సాయర్ - మహాసముద్ర రాజ్యాధిపతి. మీ రెవరు?"

"చోరాగ్రేసరచక్రవర్తి హాక్ ఫిన్. అరివీరభయంకర సముద్ర పిశాచి జోహార్పర్." అని రెండు గొంతుకలు సమాధాన మిచ్చాయి.

ఈ బిరుదులు టామ్ తగిలించినవే. ఏ పుస్తకాల్లో నుంచో ఈ మాటలు పిక్కాడు.

"సరే. మీ ఆనవాలు ఏమిటి?"

హాక్, జో ఇద్దరూ ఒక్కసారిగా "రక్తం" అన్నారు.

ఇంత జరిగిన తర్వాతగాని టామ్ పొదలోనుంచి బయటకి రాలేదు. సముద్రపుదొంగ జాగ్రత్తగా వుండొద్దూ మరి. పొదలోనుంచి బయటికి రావటానికి శుభ్రమైన దారివున్నది. కాని టామ్ ఆ దారిని రాలేదు. అందులో గొప్ప ఏముంది? ఎంత కష్టమైనదారిలోంచి వస్తే అంత గొప్ప. అందుకని ముళ్లు, రాళ్లు తొక్కుకుంటూ వళ్లంతా చీరుకుపోతుండగా ఇవతలకొచ్చాడు.

మిగతా యిద్దరువీరులు కూడా తినుబండారాలు, మిగతాసామాను తెచ్చారు. 'చోరాగ్రేసరచక్రవర్తి' పొగాకు, కొన్ని చుట్టలు కూడా తెచ్చుకున్నాడు.

నదిఒడ్డున ఒక పడవ వున్నది. ఆ పడవతాలూకు మనుషులు ఊళ్లో నిద్రపోతున్నారు. ముగ్గురూ పడవదగ్గిరికి వెళ్లారు. ఆ వెళ్లటంలో మామూలుగా వెళతారా? అడుగులో అడుగు వేసుకుంటూ "ష్, ష్" అనుకుంటూ, నడుము బెల్టులో కత్తులు వున్నట్టు అక్కడ చేతులు "రెడీ" గా పెట్టుకుని వెళారు. అక్కడ ఎవరూ వుండరని వాళ్ళకి తెలుసు. అయినా జాగ్రత్తగా వుండాలిగా దొంగలు.

పడవ నెక్కారు ముగ్గురూ. హాక్, జో తెడ్లువేస్తున్నారు. టామ్ నాయకుడుమల్లే పడవ మధ్యగా చేతులు ముడిచి నుంచున్నాడు. తతిమ్మా ఇద్దరికీ ఆజ్ఞ లిస్తున్నాడు.

"ఏయ్, ఆవేపు వెయ్ తెడ్డు."

"వేస్తున్నామండీ, సార్."

"అటు గాలివేపు తిప్పు. ఆ, అల్లా."

"తిప్పామండీ, సార్."

గట్టిగా అహా. నెమ్మదిగా. ముందుకి. ఆ, ఎత్తు. వెయ్." ఈ విధంగా టామ్ ఆజ్ఞలిస్తున్నాడు. ఈ ఆజ్ఞలు వూరికే తమాషాగా యిచ్చినవే. వాటికి అర్థంపర్థం లేదు. తరవాత ఎవ్వరూ మాట్లాడలేదు. తెడ్లువేసేవాళ్లు తమ పని తాము చేసుకుపోతున్నారు. టామ్ నుంచుని ఏదో ఆలోచిస్తున్నాడు. పడవ నదిసగానికి వచ్చింది. టామ్ ఆఖరిసారి తన ఊరికేసి చూశాడు. ఆ వూరితో తనకి ఋణం తీరిపోయింది. మహాపదలతో నిండివున్న జీవితాన్ని అనుభవించటానికి వెళ్లిపోతున్నాడు. మిగతా ఇద్దరూ కూడా తమగ్రామాన్ని ఆఖరిసారి చూసి నిట్టూర్పు విడిచారు.

రాత్రి 2గంట లయ్యేటప్పటికి పడవ జాక్సన్‌ద్వీపాన్ని చేరుకుంది. సామానులన్నీ ఒడ్డుకు చారేశారు. పడవలో వున్న తెరచాపను తీసి రెండు మూడు పొదలమీదుగా పరిచి గుడారంలాగా తయారుచేశారు. దాంట్లో తమ సామాను భద్రం చేశారు. తామమాత్రం

ఆరుబయటనే పడుకుందామనుకున్నారు.

తరవాత ఎండిన చితుకులు అన్నీ పోగుచేసి చెట్ల గుబురుల మధ్య మంటచేశారు. అందులో పెనం వేసి తమతో తెచ్చుకున్న మాంసంముక్కలని కాల్చారు. రొట్టెతో నంచుకుంటూ రాత్రి భోజనం కానిచ్చారు. కాకులు దూరని కారడవిలో, చీమలు దూరని చిట్టడవిలో ఏమనిషీ కాలు పెట్టలేని ఆ మహాద్వీపంలో, అంత రాత్రివేళ, చలిమంటదగ్గిర కూర్చుని భోజనం చేస్తుంటే వాళ్లకి తమకంటే గొప్ప అదృష్టవంతులు ప్రపంచంలో వున్నారా అనిపించింది. ఇక ఎప్పటికీ ఇళ్లకి పోగూడదని నిశ్చయించుకున్నారు.

తరవాత మంటపక్కనే పచ్చిక మీద ముగ్గురూ నడుంవాల్చారు.

"క్చ్. ఎంత బావుంది యిక్కడ." అన్నాడు జో.

హాయ్, హాయ్. మన వూళ్లో స్నేహితులకి మనమిక్కడ వున్నట్టు తెలిస్తేనా--" అన్నాడు టామ్.

"ఏడవరూ మన అదృష్టం చూసి? ఏమంటావు హాకీ?"

"ఏమో, నాకిక్కడ బలే జోరుగా వుంది. ఇంతకంటే నాకేమీ అక్కర్లేదు. ఇక్కడ నన్ను కొట్టేవాళ్లు, తిట్టేవాళ్లు ఎవరూ ఉండరు." అన్నాడు హాక్.

"నాకీ జీవితం బాగా సరిపోయింది. పొద్దున్నే లేవాలన్న బాధ లేదు. నా యిష్టం వచ్చినప్పుడు లేవచ్చు. నీళ్లుపోసుకోనక్కర్లేదు, బళ్లో కెళ్లక్కర్లేదు, చూశావా జో. సముద్రపు దొంగలు నేలమీద వున్నప్పుడు ఏం పనీ చెయ్యక్కర్లేదు. నువ్వు మునీశ్వరుడివౌతానన్నావు. మునీశ్వరుడంటే ఎంత కష్టపడాలో తెలుసా?" అన్నాడు టామ్.

"అవున్రా. మొదట్లో నేనిదంతా ఆలోచించలేదు. నువ్వు చెప్పావు గాబట్టిగాని, లేకపోతే నిష్కారణంగా కష్టపడుదును." అన్నాడు జో.

"పైగా ఈ రోజుల్లో మునీశ్వరులంటే ఎవ్వరికీ భక్తీ, గౌరవం లేవు. సముద్రపుదొంగ అంటే చాలు జనం గజగజ వణికిపోతారు. మునులైతే చలికాలంలో మంచులోను, వేసవికాలంలో నిప్పుల్లోను, వానాకాలంలో నదుల మధ్య ఒంటికాలి బొటనవేలిమీద నిలబడి తపస్సు చెయ్యాలి."

"అమ్మ బాబో. నాకిదంతా తెలియదురా." అని ఆశ్చర్యపోయాడు జో.

ఈ లోగా హాక్ చుట్ట వెలిగించి హాయిగా దమ్ములు లాగుతున్నాడు. వాడి హాయిని, ఆనందాన్ని చూసి మిత్రులిద్దరూ ఈర్ష్యపడ్డారు. వాళ్లకి పొగాకు అలవాటు లేదు. త్వరలో పొగతాగటం నేర్చుకోవాలనుకున్నారు.

"సముద్రపు దొంగలు ఏమేమి చెయ్యాల్సి వుంటుంది?" అని మత్తుగా అడిగాడు హాక్.

"ఓ. వాళ్ళపని బలేగా వుంటుంది. సరుకులు మోసుకుపోయే ఓడలుంటాయే వాటిని అడ్డగించాలి. తగలబెట్టెయ్యాలి. డబ్బు, సరుకులు దోచుకుని ఎవ్వడికీ తెలియని గుహల్లో పాతిపెట్టాలి. వాటికి దెయ్యాల్ని కాపలాపెట్టాలి. ఓడల్లోని మనుషులందర్నీ చంపెయ్యాలి." అని మహా వుషారుగా వర్ణించాడు టామ్.

"సముద్రపు దొంగలు ఆడవాళ్లని చంపరు. వాళ్ళని ద్వీపం మీదకు లాక్కుపోతారు. అన్నాడు జో.

"అవునవును. ఆడవాళ్లని చంపకూడదు. వాళు అందంగా వుంటారు. మంచివాళ్లు కూడాను."

"మరి సముద్రపు దొంగలు మంచి రాజాదుస్తులు ధరిస్తారు. రత్నాల హారాలు, ఉంగరాలు పెట్టుకుంటారు." అన్నాడు జో.

హాక్ విచారంతో అన్నాడు. "కాని మరి నాబట్టలు మాసి, చిరిగిపోయాయి. నేను పనికొస్తానా?"

మిగతా యిద్దరూ వాణ్ణి ఓదార్చారు. ఒకసారి దోచుకుంటే కావలసినన్ని మంచి బట్టలు వస్తాయనీ, ఇప్పటికీ దుస్తులు ఫరవాలేదనీ చెప్పారు.

నెమ్మదిగా వాళ్లకి నిద్రపట్టింది. హాక్ మాట్లాడుతూ మాట్లాడుతూనే నిద్రపోయాడు. చేతులోని చుట్ట జారి పక్కన పడింది. టామ్, జో కొంచెంసేపు నిద్రరాక బాధపడ్డారు. తాము చేసిన పని తప్పేమో నని ఒక భావం, బాధ కలిగించింది. చివరికెప్పుడో తెలియకుండానే నిద్రలో మునిగిపోయారు.

* * *

తెల్లవారింది. టామ్ కళ్లు నులుముకుంటూ లేచాడు. మంచంమీద ఉన్నా ననుకుని దిగబోయాడు. కాని తీరా చూస్తే కిందే పడుకున్నాడు. వెంటనే రాత్రి జరిగినదంతా జ్ఞాపకం వచ్చింది. ఇంకా సూర్యోదయం కాలేదు. పచ్చిక మీద, ఆకులమీద మంచుబొట్లు నిలిచాయి. రాత్రి వేసిన మంట చల్లారిపోయి తెల్లటి బూడిద మిగిలింది.

దూరంనించి ఒక కోకిల కూ అని కూసింది. ఇంకోటి కూ అని మళ్లీ జవాబిచ్చింది. క్రమంగా వెల్తురు వస్తోంది. పక్షు లన్నీ మేలుకుని, రొద చేస్తూ, చల్లటి గాలిలో షికార్లు చేయటం మొదలెట్టాయి. ఒక పచ్చటి పురుగు టామ్‌పక్కనున్న ఒక చిన్న మొక్కమీదికి పాకుతోంది. చివరి ఆకుమీద వరకూ పాకి అక్కడినించి టామ్ కాలి మీదకి వచ్చింది. టామ్ దాన్ని విదల్చలేదు. అది నెమ్మదిగా మోకాలు వరకూ పాకి పడిపోయింది. టామ్ సంతోషం పట్టలేక పోయాడు. పురుగు పాకిందంటే టామ్‌కి కొత్త బూట్లు, మేజోళ్లు, బట్టలు వస్తాయని అర్థం.

ఒక తూనీగ మొక్క మీద వాలింది. టామ్ వంగి, "తూనీగా, తూనీగా, నీ యిల్లు కాలిపోతోంది. నీ పిల్ల లేడుస్తున్నారు, త్వరగా పో" అన్నాడు. వెంటనే తూనీగ ఆ మాటలు గ్రహించి ఎగిరిపోయింది యింటికి.

ఒక పాలపిట్ట టామ్‌దగ్గరగా ఒక చెట్టుమీద వాలి ఈ కొత్త వాళ్లెవరా, అని అనుమానంగా చూస్తోంది. ఒక ఉడత పరుగెత్తుతూ వచ్చి వీళ్లని చూసి టక్కున ఆగిపోయి "వీ ళ్ళెవరు?" అని అనుకుంటూ పక్కకి వెళ్లిపోయింది.

టామ్ తన స్నేహితుల్ని లేపాడు. ఇంకో రెండు నిమిషాల్లో ముగ్గురూ ఒకళ్ల నొకళ్లు తరుముకుంటూ అడవిలో గెంతుతున్నారు. నీటి ఒడ్డుకి వచ్చి చూశారు. వాళ్ళ పడవ కెరటాలకి ఎక్కడికో కొట్టుకుపోయింది. అదీ మంచిదే ఒకందుకు. ఆ పడవ యజమానులు దాన్ని వెదుక్కుంటూ యిక్కడకు వస్తారేమో నన్న భయంకూడా పోయింది.

తరువాత జో మంటచేశాడు. మిగతా ఇద్దరూ గాలాలు పట్టుకువెళ్ళి, బోలెడు చాపల్ని పట్టి తీసుకొచ్చారు. ఆ చేపల్ని వేయించారు. అవి ఎంత మధురంగా వున్నాయో? అలాంటి మంచి చేపల్ని, ఇదివరకెప్పుడూ ఎవరూ తినివుండరని ఖచ్చితంగా చెప్పవచ్చు.

భోజనమయింతరవాత ముగ్గురూ ద్వీపమంతా చూడటానికి బయల్దేరారు. అన్నీ పెద్దపెద్ద చెట్లు ఒత్తయిన పచ్చిక-అందంగా విచ్చుకున్న పువ్వులు. రకరకాల పాటలుపాడే పక్షులు.

ఆ ద్వీపం మూడుమైళ్ళ పొడుగు, పావుమైలు వెడల్పు ఉంది. ద్వీపానికి రెండోవైపున నది 200గజాలకంటే ఎక్కువ వెడల్పు లేదు. ఆ తరవాత ఒడ్డునంతా దట్టమైన అరణ్యమే.

చాలాసేపు ముగ్గురూ నదిలో ఈదులాడారు. మధ్యాహ్నానికి మళ్లీ గుడారానికి వచ్చారు. చేపలు మళ్లీ పట్టేవరకూ ఆకలి ఆగేట్టు లేద. అందుకని రాత్రి తెచ్చిన మాంసంలో ఇంకా మిగిలినదాన్ని వండుకుని తిన్నారు. నిశ్శబ్దంగా వున్న అడవి, ఆ ఒంటరితనం ముగ్గురినీ కలతపరిచింది. మౌనంగా కూర్చుని ఆలోచిస్తున్నారు. ఏదో తెలియరాని దిగులు పట్టుకుంది. చోరాగ్రేసరచక్రవర్తి అయిన హాక్ కూడా తన యిల్లు, అరుగులు, మెట్లు వాటినిగూర్చి తలుచుకుని బెంగపడ్డాడు. టామ్, జో కూడా ఇంటిమీద బెంగపెట్టుకున్నారు. కాని బెంగవున్నట్టు బైటికి చెప్పటానికి సిగ్గుపడ్డారు. మళ్ళీ గుండె రాయి చేసుకున్నారు.

దూరంగా ఎక్కడినించో ఏదో 'గుంయ్' మన్నట్టు శబ్దం వినవచ్చింది. మొదట్లో వాళ్లు దాన్ని వినీకూడా పాటించలేదు. క్రమంగా ఆ శబ్దం ఎక్కువౌతోంది.

జోకి గుండెలు కొట్టుకున్నాయి. "ఏమి టా చప్పుడు?" అన్నాడు.

"గమ్మత్తుగా వుందే!" అన్నాడు టామ్.

హాక్ అందుకుని "అది ఉరుము కాదు. ఎందుకంటే ఉరుము......" అంటుండంగా మిగతాయిద్దరూ "ష్ ష్. మాట్లాడొద్దు." అన్నారు. చాలాసేపు ఆ ధ్వని విన్నారు.

"ఒడ్డుకి వెళ్లి చూద్దాం, పదండి" ముగ్గురూ లేచి గబగబ తవ గ్రామంవేపు ఒడ్డుకి వెళ్లారు.

———

# చెల్లని నోటు

(15-వ పేజీ తరువాయి)

ఫైనలువరకు చదువుకున్నాడట. అమ్మాయి గూడా వొప్పుకుంది. మీ రేమంటారు?'

వెంకటేశ్వర్లు మాట్లాడలేదు.

వెంకటేశ్వర్లు భార్య చెప్పుకుపోతూనే వున్నది. 'మీ కేమన్నా దాని పెళ్లిధ్యాస లేకపోయె, నే చెప్పగా మీ అన్నగారే చాలా సంబంధాలు చూశారు. చివరికి యిది నచ్చిందట. వొచ్చి నాకు చెప్పారు. కట్నం గూడా తక్కువలోనే అయ్యేటట్టు చూస్తామన్నారు. ఇందులో మీ ఉద్దేశ్య మేమిటి?' జవాబుకోసం ఎదురుచూస్తున్నది.

'ఇదంతా నాకు తెలీదు. ముందర నా విషయం తేల్చు. పొలం బేరం యిచ్చాను. అమ్ము, డబ్బుయివ్వు. లేకపోతే ఎక్కడైనా అప్పుతెచ్చి రెండువేల రూపాయలు యివ్వు.' యింకేమేమో అరుస్తున్నాడు, వెంకటేశ్వర్లు.

వెంకటేశ్వర్లుభార్య నిలువునా క్రుంగిపోయింది. కథ అడ్డం తిరిగింది. ఎలాగో నానాఅవస్థలూపడి పిల్లకి పెళ్ళిచేయదలుచుకొంటే, దాని కేమన్నా తన భర్తగారు ఏమీ ప్రోత్సాహసోత్సాహా లివ్వకపోగా, తామే వరుడుకోసం అన్వేషించాల్సింది బోయింది. పెళ్ళి ఎలాగో ఓలాగు చెడగొట్టాలనే చూస్తున్నారు. ఎలా చచ్చేది?

'ముందర పిల్ల పెళ్ళి కానీయండి, తరువాత ఆలోచిద్దాం!

'ముందర ఈసంగతి కానీ, తరువాత ఆపెళ్ళిసంగతి ఆలోచిద్దాం!

ఇక అటువంటి భర్తతో, కన్నందుకు పెళ్లిచేసి మంచిపిల్లవాడి చేతిలో పెట్టి తన విధ్యుక్తధర్మం నెరవేర్చుకోవలసిందిపోయి, తన విలాసాలకు ఆ పిల్లభవిష్యత్తును భస్మీపటలం చేయడం - ఏ కన్నతండ్రీ అంగీకరించడు. కాని వెంకటేశ్వర్లు కోరుతున్నాడు. ఇక ఆయనతో మాట్లాడి లాభం లేదని వూరుకుంది.

తెల్లవారి వెంకట్రామయ్య అన్నాడు.

'ఏరా! ఇదంతా మాకోసం, మాస్వార్థంకోసం అనే అనుకొంటున్నావా? ఒరిది. - దీంట్లో మేము బాగుపడే దేమీ లేదు. అంతా నీబాగుకోసమే! పిల్లను కన్నావు, దాన్ని పెంచి పెద్దదాన్ని చేసి ఎవరికో మంచివాడికి యివ్వటంవరకు తండ్రియొక్క బాధ్యత. ఆ బాధ్యత నేమన్నా నీవు నిర్వర్తించకపోగా విఘాతం కల్పించాలని చూస్తుంటివి. ఇది ఆడపిల్లలను కన్నతండ్రులు చేయవలసిన పనేనట్రా? నీవుగా, నీ కూతురుకు పెళ్లిచేయవని, చేయలేవని తెలుసుకున్నప్పుడు మేమన్నా ఆపనిచేసి, దాని భావి కాపాడటమే కాకుండా, వూళ్ళోవాళ్ల అపవాదునుంచి తప్పించుకోవటం, నీకు అన్యంగా కనిపిస్తున్నదా?'

వెంకటేశ్వర్లు మాట్లాడలేదు. మొదలకండా వూరుకున్నాడు. ఆఖరికి అన్నాడు, వెంకట్రామయ్య.

'మంచి సంబంధాన్ని యేరి, కోరి తీసుకువొచ్చాను. అంగీకరించు. ఇంతకంటె మంచి సంబంధం తేలేనప్పుడు, ఆ మంచి సంబంధాన్నే ఒప్పుకోక మనం చేసే దేమిటి?'

శుక్రవారం వొచ్చింది. వాళ్లు వొచ్చారు; పిల్లవాడి తండ్రీ, మామా, ఇంకోవూళ్లో మనిషీ. వీళ్ళని బజాట్లో చూసి వెంకట్రామయ్య, కబుగ చెబుతూ తీసుకువొచ్చాడు, వెంకటేశ్వర్ల యింటికి.

బయట వరండాలో నిలబెట్టి లోనకు వెళ్ళాడు వెంకట్రామయ్య, వొచ్చినవాళ్లకి మర్యాద చేయాలని-పిల్ల ముస్తాబై వున్నదో లేదో చూద్దామని.

లోన వెంకటేశ్వర్లు బిగ్గరగా అరుస్తున్నాడు. వెంకట్రామయ్య అదిరిపోయాడు.

'చెప్పు, ముందర ఈ సంగతి చెప్పు. పెళ్లి తరువాత.పొలం అమ్ముతావా? లేదా? లేకపోతే చంపేస్తాను, నిలువునా నరికేస్తాను. నా సంగతి తెలీదేమో నీకు!'

వెంకట్రామయ్య ద్వారంలోనే నిలుచుండిపోయాడు, నిలువునా నీరై.

వెంకటేశ్వర్ల భార్య యేడుస్తున్నది సన్నగా!

వొచ్చిన చుట్టాలకు అమర్యాద - అవమానం భరించలేకపోతున్నాడు వెంకట్రామయ్య. ఇంతాచేసి యిక్కడికి పెళ్ళిచూపులకు తీసుకువొస్తే...ఇక్కడ ఈ రభస!

వెంకట్రామయ్య బయటికి వొచ్చి తలకొయ వొంచుకున్నాడు. పాపం పెద్దవాడు, మర్యాదస్తుడు.

'అత నేనా మీ తమ్ముడు?' అని ఎవరో అన్నారు. వెంకట్రామయ్య పొందిన అవమానానికి అంతులేదు.

లోన వెంకటేశ్వర్లు పెద్దగా అరుస్తున్నాడు -

'చెప్పు, పొలం యిస్తావా? ఇవ్వవా? లేకపోతే చంపేస్తాను! నరికేస్తాను!- ★

# తమాషా ప్రశ్నలు

(1) ఒకపెట్టె 6 వీసెలపైన, బండిని కలుసుకోగలిగాను. బండి తన బరువులో సగం తూక్కం తూగింది. పెట్టె బరు వెంత ?

(2) నేను గంటకు 4 మైళ్ల వేగంతో నడుస్తున్నాను. నాముందు ఒక గుర్రపుబండి పోతున్నది. నాకు దానికి మధ్య ఒక ఫర్లాంగుదూరం వున్నది. ఒక పావుగంటసేపు నడిచి గుర్రపు గంట కెన్ని మైళ్ల వేగంతో పోతున్నది ?

(3) ఒకటిన్నర కోడిపెట్టలు ఒకటిన్నర రోజుల్లో ఒకటిన్నర గుడ్లు పెడితే ఒక కోడిపెట్ట 6 రోజుల్లో ఎన్ని గుడ్లు పెడుతుంది ?

(జవాబులు మరోపేజీలో)

## ముగ్గురు వీరులు

(33-వ పేజీ తరువాయి)

ముగ్గురు వీరు లున్నారు. వాళ్లు మననికూడా మింగేస్తారుట ! చావు తప్పి, కన్ను లొట్టపోయి ఎలాగో వచ్చాను యిలాగ." అని చెప్పింది.

ఇది విని, ఆ పిశాచ రాజు, "ఇదేమీ నమ్మతగ్గదిగాదు. మనని జయించేవా ళ్లెక్కడున్నారు? చూడాలి. యిక్కడికి రమ్మను." అని ఆ పిశాచాన్ని పంపించింది.

ఆ పిశాచం పరిగెత్తుకుంటూ ఆ ముగ్గురిదగ్గిరకీ పోయి "మారాజు మిమ్మల్ని నమ్మటంలేదు. ఈ సాయంత్రం సభలో మిమ్మల్ని చూస్తారట. మీరు రావాలి." అని బ్రతిమాలి వెళ్ళిపోయింది.

ఆ సాయంతం ఆ సభ ఆరంభించకముందే వాళ్లు ముగ్గురూ ఒక చెట్టులో కనిపించకుండా కూర్చున్నారు. ఇంతలో ఆ పిశాచాన్ని పిలిచి, "ఏరీ వాళ్లు ?" అని అడిగాడు పిశాచరాజు.

ఇది వింటూనే ధనుర్ధరుడు తన బాణా లేసి ఆ పిశాచాల కళ్లల్లోకి గురిచూసి కొట్టాడు. అవన్నీ దిక్కులు తెలియక కన్నులు లొట్టపోయి తోచిన దిక్కుకల్లా పరిగెత్తడం ఆరంభించాయి.

పిశాచరాజు మట్టుకు ఒక గోతిలో పడి కొట్టుమిట్టాడుతున్నాడు. దారితెలియక. ఇంతలో వస్తాదు ఆ గోతిలోకి ఉరికి, తన బలంఅంతా పెట్టి ఒక్క గుద్దు గుద్దేసరికి ఆ పిశాచరాజు కుయ్యో మొర్రో అని మొర పెట్టుకుని, "రక్షించు నన్ను. యిక్కడున్న రత్నాలూ వైడూర్యాలూ అన్నీ నీవే." అని బ్రతిమాలాడు. దాంతో వాళ్లు పిశాచరాజుని వదిలిపెట్టి, ఆ రత్నాలు అన్నీ సమానంగా పంచుకుని అక్కణ్ణుంచి తిరిగి తమ తమ ఊళ్ళకి వెళ్లి సుఖంగా ఉన్నారు.

---

## తిలోత్తమ

(11-వ పేజీ తరువాయి)

"ఉహూఁ"

"పెళ్ళి అయి పోగానే నిన్ను పుట్టింటికి పంపెయ్యాలని అన్నారు. విన్నావా ఆ మాట ?"

"విన్నాను. అలాగే వెళ్ళిపోతాను. దయ ఉంచి మీరు మధ్యమధ్య ఎప్పుడైనా ఒకటి రెండుసార్లు వస్తూఉంటే చాలు. నా కదే పదివేలు- వెడుతున్నా. చాలా పను లున్నాయి నాకు." వెళ్ళిపోయింది.

గోకుల్ కాస్సేపు బోర్లగా పడుకుని, మళ్ళీ లేచి కూర్చున్నాడు. మంచంమీది నుంచి దిగి, కిటికీ దగ్గిర కెళ్ళి నుంచుని చూస్తున్నాడు. తిలోత్తమ పెంటపోగు దగ్గిర కూర్చుని అంట్లుతోముతోంది.

... ... ...

ప్రధానసమయానికి కావలసిన సరంజామా అంతా పట్టించుకుని ఉషతల్లి వచ్చింది. ప్రయత్నాలన్నీ ప్రభసంగానే ఉన్నాయి. ఆమె వచ్చేప్పుడు ఒక పెద్ద దంసకూడా తీసుకుని వచ్చింది "ఉష ... నాళ్లూ మేలుకుని కూర్చుని ఈ దం... స్వయంగా కట్టింది" అన్నది ఆమె చిరునవ్వు నవ్వుతూ. క్రింద కాన్సెట్స్ పరిచి ఉన్నాయి. గోకుల్ స్నానంచేసి వచ్చాడు. ఆ దంస వేసుకుని గోకుల్ అక్కడకువచ్చి కూర్చోవాలి. ఇంతలో గోకుల్ తల్లి వచ్చి "శంఖం ఎవరు ఊదుతార్రా ? నేను ఊదదామంటే నా పెదిమెలమీద పుళ్లు ఉనాయి. తిలూ ! ఎక్కడికి పోయావ్ నువ్వు? వచ్చి శంఖంఊదరాదూ?" అన్నది.

( భసమయంలో శంఖం ఊదటం వం... దేశీయుల సంప్రదాయం)

శంఖం చేత పుచ్చుకుని తిలోత్తమ సంకోచిస్తూ గుమ్మందగ్గిరకు వచ్చి నుంచుంది.

ఆమె శంఖం ఊదుతూంటే గోకుల్‌కి నఖశిఖ పర్యంతం శరీరంలో ఏదో విద్యుత్ ప్రసరించినట్లయింది. అది వి... సరికి ఏవో పిడుగుపడ్డట్లు అతడి ఆలోచ... లన్నీ ఛిన్నాభిన్నమై పోయాయి.

"నన్ను క్షమించండి"

అంటూ రెండుచేతులతోనూ ఆ దం... త్రెంచిపారేసి గోకుల్ అక్కడినుంచి మే... మీదికి వెళ్ళిపోయాడు.

[అనువాదం : శ్రీ సూరి]




పూర్వ మొక పట్టణంలో ఒక గొప్ప వర్తకు డుండేవాడు. అతనికి మదనుడని ఒక కొడుకున్నాడు. తండ్రి మదనుడికి చిన్నప్పటినుంచీ బాగా చదువు చెప్పించాడు. మదనుడు చాలా తెలివైనవా డవటంచేత పదేళ్ల వయస్సుకే సకలవిద్యలూ నేర్చాడు.

ఒకసారి ఆ వర్తకుడు ఒక దూరదేశానికి వర్తకానికై వెళ్లవలసివచ్చింది. మదనుడు తాను కూడా వస్తానని పట్టుబట్టి బయలుదేరాడు. ఇద్దరూ ఒక ఓడమీద బయలుదేరారు. కొన్ని రోజులకి వారు ఈజిప్టుదేశం చేరుకున్నారు. ఓడ దిగి సముద్రపుబడ్డునే ఉన్న ఒక పట్టణంలోకి వెళ్లారు. పట్టణంలో ఒకచోట ఒక యింట్లో తమాషా శబ్దాలు వినిపిస్తున్నాయి. ఏమిటా అని ఇద్దరూ తొంగిచూశారు. ఒక పండితుడు ఇరవై, ముప్ఫైమంది విద్యార్థులను కూర్చోబెట్టుకుని పక్షిభాష నేర్పుతున్నాడు.

వర్తకుడు తన కొడుక్కి కూడా పక్షిభాష నేర్పిస్తే బావుంటుందని పండితుణ్ణి అడిగాడు. పండితుడు తెలివితేటలు ఉట్టిపడే మదనుడిని చూసి తప్పకుండా విద్య చెబుతానని దగ్గర చేర్చుకున్నాడు. వర్తకుడు మళ్లీ తాను రెండేళ్లలో వస్తాననీ, కుమారుని అప్పుడు తీసుకుపోతాననీ చెప్పాడు. పండితుడికి జీతానికిగాను చాలా ధనమిచ్చి వర్తకుడు తిరిగి ఓడ నెక్కి వెళ్లిపోయాడు.

శ్రీ హరీన్ ఛట్టో

మళ్లీ రెండేళ్లతరవాత వర్తకుడు వర్తకం పూర్తిచేసుకుని తిరిగి బయలుదేరాడు. కాని పూర్వం తను కుమారుని వదలిపెట్టిన ఆ పట్టణం ఎక్కడుందో తెలియలేదు. ఓడలోవాళ్లని ఎవర్ని అడిగినా చెప్పలేకపోయారు. పాపం చాలా రోజులు వెతికాడుకాని ఆ పట్నం కనుక్కోలేకపోయాడు. చివరికి నిరాశ చేసుకుని తన స్వంతపట్టణానికి వెళ్లిపోయాడు. తమ కుమారుడు సముద్రంలో జారిపడి చనిపోయాడని, భార్యకి అబద్ధంకల్పించి చెప్పాడు. ఆమె తమ ఒక్కగాని ఒక్క కొడుకు చనిపోవడంవల్ల ఎన్నో రోజులు దుఃఖించింది.

వర్తకుడు పదేళ్లతరవాత మళ్లీ వర్తకానికై ఓడ నెక్కి బయల్దేరాడు. ఈసారి తిరిగి వచ్చేటప్పుడు అదృష్టవశాత్తు ఆ ఓడ పూర్వపు పట్టణంవద్ద ఆగింది. ఆ పట్టణాన్ని వర్తకుడు గుర్తుపట్టి సంతోషంతో ఊళ్లోకి వెళ్లి పండితుడి యింటిని చేరుకున్నాడు. అక్కడ యిదివరకులాగే పక్షిభాష పాఠాలు జరుగుతున్నాయి. కాని పండితుడు కూర్చునేచోట ఒక ఇరవై రెండేళ్ల యువకుడు కూర్చునున్నాడు.

అతడు తన కుమారుడే నని వర్తకుడు గుర్తుపట్టలేదు. కాని యువకుడు గుర్తుపట్టాడు. “నాన్నా! నేను మదనుడిని.” అన్నాడతడు. వర్తకుడు సంతోషంతో అతడిని కౌగలించుకుని “మీ గురువుగా రేరీ?” అని అడిగాడు. “ఆయన ముసలివారై పోయి

కందున నేనే పాఠాలు చెబుతున్నాను." అన్నాడు మదనుడు.

ఇంతలో యీ మాటలు విని లోపలినుండి పండితుడు వచ్చాడు. మదనుడు ప్రపంచంలో వున్న రకరకాల పక్షుల భాష లన్నిటినీ పూర్తిగా నేర్చుకున్నాడని పండితుడు చెప్పాడు.

వర్తకుడు తన కుమారునికి అంత శ్రద్ధతో విద్య నేర్పి, పోషించినందుకు కృతజ్ఞతతో పండితుడికి చాలా డబ్బు బహుమాన మిచ్చాడు.

తండ్రీ, కొడుకులు ఓడ నెక్కి తిరుగుప్రయాణం మొదలు పెట్టారు. ఆ ఓడలో ఇంకా చాలామంది ధనవంతులైన వర్తకు లున్నారు. వాళ్లందరికీ 'ఇతడు నా కుమారుడు మదనుడు. రకరకాల పక్షుల భాషలు నేర్చుకున్నాడు.' అని అందరికీ పరిచయం చేశాడు.

ఇంతలో మూడు పక్షులు ఓడమీద వాలి ఏదో మాట్లాడుకుంటున్నాయి. "చిక్ చిక్ - టుయ్ టుయ్-చిక్ చిక్-" అని అర్థంకాని శబ్దాలు చేస్తున్నాయి. వర్తకు డది విని "ఏం మాట్లాడుతున్నా" యని మదనుని అడిగాడు. కాని అతడు సమాధానం చెప్పలేదు. తండ్రి గుచ్చిగుచ్చి అడిగాడు. కాని మదనుడు మూగవాడిలా మాట్లాడకుండా కూర్చున్నాడు.

ఓడలోని ప్రయాణీకులంతా తండ్రీకొడుకులను 'ఎద్దేవా' చేయటం ప్రారంభించారు.

"పన్నెండేళ్లపాటు పక్షుల భాష నేర్చుకోవటంవల్ల పాపం మనుషుల భాష మర్చిపోయాడల్లే వుంది." అని ఒకడు ఎగతాళిచేశాడు. అందరూ విరగబడి నవ్వారు. "[illegible]ంటావా, చెప్పవా?" అ

వర్తకుడు కోపంగా అడిగాడు.

"చెబుతాను కాని నీకు కోపం రావచ్చు." అన్నాడు మదనుడు.

"ఫరవాలేదు, చెప్పేసెయ్" అన్నాడు తండ్రి. మిగతావాళ్లందరూకూడ చెప్పేసెయ్యమని కేకలు వేశారు.

"అయితే సరే. ఆ పక్షులు నేను రాజు నవుతానని, నువ్వు నా కింద నౌకరు అవుతావని జోస్యం చెబుతున్నాయి." అన్నాడు మదనుడు తండ్రితో.

ఈ మాటల కందరూ పగలబడి నవ్వారు. తండ్రికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. కాని అప్పటికి మాట్లాడకుండా వూరుకున్నాడు.

ఆ రాత్రి ఓడలో అందరూ నిద్రపోతున్న సమయంలో మనిషి పట్టేటంత పెట్టె నొకదాన్ని ఖాళీ చేసి అందులో తన కుమారుని కాళ్లు, చేతులు, నోరు కట్టేసి పడేసి పెట్టెని సముద్రంలోకి తోసేశాడు వర్తకుడు.

"వీడు రాజు అవుతాట్ట-నేను వీడికి నౌకరు నవుతానట. పక్షులట-జోస్యం చెబుతాయట. ఆహాహ్హా! ఇప్పుడింటికి పోయి మనుడు సముద్రంలో పడి చచ్చిపోతాడని ఖచ్చితంగా చెప్పవచ్చు." అనుకున్నాడు వర్తకుడు.

కాని ఇంటికి వెళ్లేటప్పటికి ఏముంది? వర్తకుడి భవనం యావత్తూ అతడు లేనప్పుడు కాలిపోయి బూడిదైంది. కొన్ని లక్షల ఆస్తి నాశనమైంది. భార్య ఒక పూరికొంపలో నివసిస్తోంది. ఈ దురవస్థకు వలవల ఏడ్చాడు వర్తకుడు. ఈ వూళ్లో వుండగూడదు; మరో దేశానికి పోయి మళ్లీ ధనం సంపాదించాలని అతడు భార్యతో సహా బయల్దేరాడు.

## 2

అక్కడ మదనుడు పెట్టెలో బంధింపబడి తరంగాలెక్కడికి తీసుకువెడితే అక్కడికి పోతూడు. పెట్టె చివరికి సముద్రపు ఒడ్డున గల ఒక కొత్త దేశానికి చేరుకున్నది. అక్కడ చేపలు పట్టే బెస్తవాడొకడు దాన్ని చూసి దాంట్లో ధనం ఉండవచ్చునని ఆశతో ఒడ్డుకు చేర్చాడు. కాని ఇంటికి తీసుకుపోయి మూత తెరిచి చూడగా అందులో వెలగల దుస్తులు ధరించిన, అందమైన యువకుడొకడు కనిపించాడు. బెస్తవాడు, అతని భార్య నిర్ఘాంతపోయారు.

"నువ్వు మనిషివా, దేవతవా?" అని అడిగారు వాళ్లు.

"నేను మనిషినే. మీరు భయపడవద్దు. కాలవశాత్తు ఈ అపాయంలో చిక్కుకున్నాను." అని తన తండ్రి చేసిన మోసం మొదలైన విషయాలన్నీ చెప్పాడు మదనుడు.

ఆరోజునుంచీ మదనుడు ఆ బెస్తకుటుంబంలోనే నివసించాడు. తనుకూడా కష్టపడి పనిచేసి వాళ్లకి పెట్టేవాడు. వాళ్లుకూడా అతన్ని తమ కుమారునిగా చూసుకుంటూ వుండేవారు.

ఇట్లా ఉండగా ఆ దేశంలో ఒక వింత సంభవించింది. రాజుగారు కొలువు తీర్చి సింహాసనంమీద కూర్చోవటంతడవు మూడు పక్షులు సింహద్వారంవద్ద వాలి పోట్లాడుకునేవి. రాజువేపు తిరిగి ఏమో చెప్పేవి. చివరికి ఎగిరిపోతూ ఆయన నెత్తిమీద రెట్టలువేసి పోయేవి.

వాటిని ఎంత తోలినా పోయేవి కావు. రోజూ వచ్చి అదేవిధంగా చేసేవి. పట్టకుందామంటే దొరకవు. బాణం వేస్తే తప్పించుకునేవి. రాజుగారికి ఈ గోలతో మతిపోయినంతపని అయింది. పైగా నెత్తిమీద రెట్టలుకూడాను. సభలో వారంతా ఈ తమాషా చూసి తెగ నవ్వేవారు. రాజుగారు భరించలేకపోతూడు ఈ అవమానం. ఆ పక్షుల మర్మం చెప్పి, వాటిని రాకుండా చేసినవాళ్లకి అర్ధరాజ్యం యిస్తానని ప్రకటించాడు. ఎందరో ప్రయత్నించారు. కాని ఒక్కరికీ వాటి రహస్యం తెలియలేదు. రాజుగారు నిద్రాహారాలు మాని బెంగపెట్టుకున్నాడు. నెత్తిమీద రెట్టలు కడుక్కోలేక అవస్థపడుతున్నాడు.

ఈ సంగతి మదనుడికి తెలిసింది. ఆ రహస్యం తను చెప్పగలనని బయల్దేరాడు రాజుదగ్గరికి. ఆ రోజున మామూలుగా మూడు పక్షులూ ద్వారం మీద వాలి రొదచేస్తున్నాయి. మదనుడికి అవి మాట్లాడే ప్రతిమాటా అర్థమైంది. అప్పుడు రాజుతో ఇలాగ అన్నాడు.

"రాజా! ఆ పక్షులు ఏం చెబుతున్నాయో నేను చెప్పగలను. కాని చెప్పటానికి ముందు నువ్వు వాగ్దానం చేసినప్రకారం ముందుగా

నాకు అర్ధరాజ్యం యిస్తూ పత్రం రాయాలి. రాయకపోతే నేను చెప్పను." అన్నాడు.

రాజు ఇందుకు ఒప్పుకుని అర్ధ రాజ్యం యిస్తున్నట్టు పత్రం రాశాడు. అప్పుడు మదను డిలాగన్నాడు.

"ఈ పక్షులలో రెండు మొగవి. ఒకటి ఆడది. ఆడది అందులో ఒక మొగపక్షికి భార్య. భర్త దూర దేశం వెళ్లి ఎంతకాలానికీ రాకపోయే సరికి భార్య ఆ రెండో మగ పక్షిని పెళ్లి చేసుకుంది. తర్వాత అసలు భర్త వచ్చి 'నా పెళ్లాన్ని నా కివ్వ' మన్నాడు. రెండో భర్త యివ్వ నన్నాడు. పాపం ఆ భార్య ఈ యిద్దరి దెబ్బలాటలోను అవస్థ పడుతున్నది. ఈ దెబ్బలాట తీర్చ మని అవి మిమ్మల్ని అడుగుతున్నవి." అన్నాడు మదనుడు.

రాజుకి ఈ సమస్య ఎలా తీర్చాలో తెలియలేదు. అప్పుడు మదనుడు మగపక్షులలో ఒకదానిని తూర్పుకు పొమ్మన్నాడు. రెండో దానిని పడమరకు పొమ్మన్నాడు. ఆడపక్షిని ఏ భర్తతో పోవాల నుంటే ఆ వేపుకి పొమ్మన్నాడు.

ఆడపక్షి తన మొదటిభర్త కేసి ఎగిరిపోయింది దాంతో వాటి గందరగోళం తగ్గింది.

రాజు ఈ చిత్రం చూశాడు. "ఈ యువకుడు ఏదో కిచకిచమని వాటిని తోలేసి అర్ధరాజ్యం లాగు దామని చూస్తున్నాడు. వీడికి నే నెందు కివ్వాలి." అనుకున్నాడు. 'పత్రంమీద సంతకం పెట్టను పొ' మ్మన్నాడు. మదనుడికి కోపం వచ్చింది.

"రాజా! మర్యాదగా సంతకం పెట్టకపోతే, బలవంతాన పెట్టించా ల్సివస్తుంది." అన్నాడు.

"ఆ నీ బెదిరింపుల కేమొచ్చింది లే. ఏం చేస్తావో చెయ్యి." అన్నాడు రాజు ధీమాగా.

వెంటనే మదనుడు గొంతెత్తి పక్షిభాషలో ఏదో అరిచాడు. వెంటనే వెయ్యి విమానాలు వస్తున్నంత మోత అయింది. దూరంనుంచి ఆకాశంలో నల్లటిమబ్బుల్లాగా ఏదో కదిలివస్తోంది. క్రమంగా మోత ఎక్కువైంది.

మదనుడి అరుపు వినగానే ఆ దేశంలో వున్న ఎక్కడెక్కడి పక్షులూ, రాబందులూ, గద్దలూ, డేగలూ, గండభేరుండాలు వచ్చేశాయి. అవి రాజభవనాన్ని చుట్టుముట్టాయి. అంతా కటికచీకటైపోయింది. రాజు గజగజ వణుకుతున్నాడు, ఆ పక్షులు తన్ను ఎక్కడ పీక్కుతింటాయో నని.

"ఆ పక్షుల్ని పంపించేసెయ్యి, నీకు అర్ధరాజ్యం యిస్తాను" అన్నాడు.

"ముందు సంతకం పెడితేనే వాటిని పొమ్మంటాను." అన్నాడు మదనుడు. రాజు సిగ్గుతో కుంగిపోతూ దీపాల వెలుతురులో పత్రం మీద సంతకం చేశాడు. వెంటనే మదనుడు ఆ పక్షులను పొమ్మని ఆజ్ఞాపించాడు.

ఇప్పుడు మదనుడు అర్ధరాజ్యానికి రాజయ్యాడు. అసలురాజు చని పోగానే మిగతా రాజ్యాన్నికూడా వశపరుచుకుని ప్రజలను కన్నబిడ్డలుగా పరిపాలిస్తున్నాడు.

ఇక్కడ మదనుడి తల్లిదండ్రులు జీవనం గడవక దేశాలన్నీ తిరుగుతూ ఈ రాజ్యానికి వచ్చారు. మంత్రిదర్శనం చేసుకొని ఏదన్నా ఉద్యోగం యిప్పించమని వేడుకున్నారు. మంత్రి రాజుగారి వంటశాలకు కట్టెలు తిసుకొచ్చే పని వర్తకుడికి, రాజుగారి బట్టలు ఉదికేపని అతని భార్యకూ యిచ్చాడు. రాజ్యం చేస్తున్న యిప్పటి రాజు తమ కొడుకే నని వాళ్లకి తెలియదు.

ఒక రోజున మదనుడు తన మేడ మీదనుండి చూస్తున్నాడు. కొందరు తన వంటశాలకి కట్టెలు మోసుకొస్తూఉండటం చూశాడు. వాళ్లల్లో ఒకడు కట్టెలమోపును మొయ్యలేక ఆయాసంతో వస్తున్నాడు. 'ఆ మనిషిని ఎక్కడో చూసినట్టుందే' అనుకుని అతనిని పిలిపించాడు.

"ఏవూరు నీది?" అడిగాడు మదనుడు.

వర్తకుడు తన వూరు తన పేరు చెప్పాడు.

"నీకు పెళ్లాం బిడ్డ లున్నారా?"

"పెళ్లా మున్నదిగాని బిడ్డలు లేనేలేరు." అని వర్తకుడు అబద్ధం చెప్పాడు.

మదనుడు తన బట్టలు ఉదుకుతున్న వర్తకుడి భార్యని కూడా పిలిపించాడు.

"నీ కెందరు పిల్లలు?"

"ఒక కొడుకుండేవాడు, రాజా! వాడు సముద్రంలో పడి చనిపోయాడు." అని చెప్పిందామె.

"ఇప్పుడు నీకొడుకు కనిపిస్తే గుర్తుపట్టగలవా?"

(46-వ పేజీ చూడండి)




వితంలో ఎన్నో సంఘటనలు. ఒక దానికి, మరొక దానికి సంబంధము న్నట్టే గోచరించదు. అయినా వాటిలో ఏదో ఒక సామాన్య లక్షణమో, అవి సంభవించే క్రమంలో ఒక వైశిష్యమో, అథమం మన దృక్పథం తెలుసుకోనడానికి ఒక మార్గమో ఏదో ఒకటి గోచరించక మానదు. ఇదంతా జీవితంగురించి తెలుసుకోవాలన్న జిజ్ఞాసకలవారికి. నాకు మాత్రం-నా మనస్తత్వం విశదపరచడానికి ఒక చిన్న ఉపమానం చెబుతాను —

పేవ్‌మెంటుమీద శవం - అనాథప్రేత - ఆపాదమస్తకం ముసుగు. ప్రానికి ఉండవలసిన లక్షణాలన్నీ క్రమం తప్పకుండా ఉన్నాయి. వచ్చే పోయే ప్రతి బస్సుదగ్గరా ఒక పళ్ళెంతో, దైన్యం మూర్తీభవించిన దృక్కులతో, కంపించే స్వరాలతో అనాథశవం బాబూ, రే పెవరికైనా ఈ గతి పట్టవచ్చు. ఏదో ఇంతా-తలా ఒకడబ్బు - మీకు తోచినంత- దహన సంస్కారానికి, అనిఅభ్యర్థిస్తూ ఒక పెద్దమనిషి లాంటి వ్యక్తి. చుట్టూ ఒకే రకానికి చెందిన - వర్ణించడానికి అలవికాని-వ్యక్తుల బృందం. అదే జాతిశవమో, ఏలింగానికి చెందినదో తెలుసుకోకుండా అసలు అది ఎందుకు శవమైందో తెలుసుకోడానికి ఆధారం లేకుండా - దాని పుట్టుపూర్వోత్తరాలతో నిమిత్తం లేకుండా - డబ్బు - ఎంతైనా సరే - పారేయడానికి మనస్కరించదు. పోనీ ఇవ్వకుండా ఉందామంటే - ఏమో - రేపు ఎవరికైనా ఎలాంటిగతి పట్టవచ్చునని ఆ వ్యక్తి బెదరించాడాయె - నిఅశంక.

శవంచుట్టూ మూగిన - ఆప్తబంధువులు ఆకస్మికంగా కాళ్ళకు బుద్ధి చెబుతారు. అదేమిటో అర్థంకాదు. అంతలో ఒక పోలీసు సబ్ ఇన్‌స్పెక్టర్ కాబోలు- శవంకాళ్ళమీద బేతిబెత్తంతో ఒక సున్ని

తప్పైన దెబ్బ - అంతటితో సరి పెట్టక - 'లేరా, మిగిలింది తరువాతి చద్దువుగానలే' అని ఒక హెచ్చరిక. 'పోలీసు' అని ఎవరో కేక. ఆకేకతో నాటకం ముగించవలసిన సమయం ఆసన్నమైనదని తెలుసుకున్న నటశిఖామణి - స్ట్రెచ్చరులోంచి లేచిన శవం ఒక్క దుముకుతో - ముసుగు ఒట్టు పోనివ్వకుండా - పోలీసు అధికారి చేతుల్లో పడకుండా - మహా లాఘవంతో ఒక్క పరుగు. అంతే. ప్రేక్షకుడైన ప్రతివాడూ - జాలిపడినందుకు మనస్సులో తిట్టుకుంటూ - 'అందుకే నిజంగా చచ్చిపోయిన శవాల్ని తగులబెట్టడానికి కూడా ఎవ్వరూ కాని ఇవ్వరు' అని గట్టిగా పైకి అంటూ చల్లగా ఆ రంగంనుండి నిష్క్రమించడం.

అదిగో ఆ శవం మన సత్వం వంటిది నా తత్వం కూడా. చూద్దాం - ప్రపంచం ఎలా నడుస్తుందో - అని.

ఇంతకీ అసలు విషయం చెప్పకుండా శాఖా చంక్రమణం చేయడం భావ్యం కాదు. చదువుకున్నకొద్దీ, జీవితాన్ని స్వంతం చేసుకొనడానికి తగిన శక్తి సామర్థ్యాలు, విశాల హృదయము ఏర్పడి - ప్రపంచజ్ఞానం కూడా పెంపొందుతుందంటాడు మావాడు. ఈ మావాడు ప్రతివారికి ఉండే మావాడే వంటి మావాడె. అది అవునో కాదో సిద్ధాంతీకరించి చెప్పడం - సాధ్యం కాదేమో కూడా - అనవసరం, ఒప్పుకుందుముగ. ప్రతి నరమానవుడికీ ఒక సిద్ధాంతం - కొన్ని సందర్భాలలో పలకువేల సిద్ధాంతాలు - అతనితో నే పుట్టి, పెరిగి, నరనరాలా వ్యాపించి, శిలల్లో జీర్ణించిపోయి - జీర్ణ సత్యాల్లా ఉన్నాయి. అందువల్ల నీ నా సిద్ధాంతాలతో ఎవరికీ పనిలేదు.

ఈమధ్య - ఇటువల - కొలదిరోజుల క్రితమే - బొత్తిగా ముప్పై మొన్నే - ఒక చిన్న వారపత్రిక ప్రారంభించి, సంపాదకుణ్ణి అవుదామనే సదభిప్రాయం కలిగింది. పూర్వంలాగా కాదు. ఇప్పుడు నాలుగణాల డబ్బులతో కావలసిన పేపరుకు దైనిక, వారం, పక్ష, మాసిక, ద్వైమాసిక, త్రైమాసిక, సాంవత్సరిక, శతవార్షిక పత్రికల్లో దేనికైనా ఏ లేటి ప్రయాస లేకుండా సంపాదకుడు కావచ్చు.

ఒక శుభదినాన ఫలానా అధికారి దివ్య సముఖానికి విజయం చేసి, మన కులగోత్ర నామాదులతో, బిరుద సహస్రనామావళితో ఫలానా పత్రికకు సంపాదక, ప్రకాశక ఇత్యాదయః అని పదిమందికి వినిపించేలా ప్రకటించుకోవలసినదని ఒక శ్రీముఖం. ఆ శ్రీముఖం అందే సమయానికే నా ప్రారంభోత్సాహం సన్నగిల్లి, అడుగారి ఆవిరై అదృశ్యమైన పదవరోజు. అది పదకొండో రోజు అయినకావచ్చు. ఏదైనా గణిత శాస్త్రజ్ఞులు కాని వారికి ఒకటి, రెండు తేడా ఉన్నంతమాత్రంచేత బాధ లేదు.

అందువల్ల వెళ్ళాలనే కోరిక లేదు. వెళ్ళకపోతే - ఏమో - తిరిగి అదే సందేహం ఇంత అధికార మున్న కార్యాలయం - ఎందుకు రాలేదని కొరత వేస్తుందేమో అని భయం. చివరికి భయమే - మహామహానాయకుల ఉద్బోధలు పరిగణించకుండానే - నెగ్గింది. వెళ్ళాను.

అక్కడ పెద్దగుమాస్తా అనే అధికారి - ఆయనతో సవినయంగా సంగతి మనవి చేసుకున్నాను. ఆయన అంతా విని - చిరునవ్వు - ప్రాయశః నా మేధాశక్తికి సంతోషాశ్చర్యాలు కలిగి ఉండవచ్చు - పారేసి, "సంపాదకుడుగా 'బాజా భజంత్రీలతో' ప్రకటించుకుంటామని దరఖాస్తు పెట్టుకున్నవారు మీరే గనుక - మీ కవసరం లేకపోతే - మానేయవచ్చు. ఇంత శ్రమపడి ఎందుకు వచ్చారు?" అని ఒక లేనవ్వు. ఎదుటివాడికన్న ఎక్కువ తెలిసి ఉండి అది ఎంత నాసిరకం - ఉప్పు ఖరీదులాంటి విషయమైనా సరే - పొరపాటు చేశాడా, పప్పులో కాలువేశాడా - మనకు నవ్వు రావలసిందే. తప్పదు. అది సహజం. ప్రకృతిసిద్ధం. మానవత్వం. చెప్పొద్దూ?

నాకూ నవ్వు వచ్చింది. నేను కూడా చదువుకున్నవాణ్ణే. కాదని అనవలసిన అవసరం మాత్రం ఎవరికి ఉంది? నాకీమాత్రం విషయం తట్టలేదేమా అని నవ్వువచ్చినమాట వాస్తవం.

ప్రపంచజ్ఞానం కూడా ఉండవచ్చు - చదువుకున్నంతమాత్రంచేత ప్రపంచజ్ఞానం ఉంటుందని కూడా చెప్పడం - ఆరోగ్యకరం కాదేమో.

అదో పట్టణమూ కాక, పల్లెటూరూ కాక మధ్యరకంగా - త్రిశంకు స్వర్గంలా - నేపాల్‌లా ఉండే ఊరు. అది కొంచెం పట్టణానికే దగ్గరగా ఉంటుంది. అదే మొదటిసారి అక్కడికి వెళ్ళడం.

హోటల్‌లో కాఫ్యాదులు సేవించి - ఇది కథల్లోమాత్రం అంతా విధిగాచేసే ఘన కార్యం - కాగ్డు ముక్కొకటి కొని, ఇంటికి ఉత్తరం వ్రాద్దామని బయలుదేరాను. అంతలో పెద్దకలకలం. రోడ్డుమీద జనం ఎక్కడికక్కడికే చెల్లాచెదరయిపోయారు. సైకిళ్ళు వదిలిపెట్టి - కారుల్లో దూరి, తలుపులు బిడాయించుకుని - తెరచిఉన్న ప్రతి ఇంటి గుమ్మంలోను ప్రవేశించి, తలుపులు ఓరగా ఉంచి, నక్కి నక్కి చూసేవారు - నిమిషమైనా కాలేదు. రోడ్డుమీద ఏకాకి - ఏకాకి? - నయ్యాను. చూద్దునుకదా. దూరంగా ఆంబోతు ఒకటి రంకెలువేస్తూ పరుగెత్తుకుని వస్తోంది. ప్రతి గుమ్మంలోంచీ, కిటికీలోంచీ, కళ్ళున్న ప్రతివాడూ చూస్తున్నాడు. నా వెనకాలనుంచి ఎవరో పొలికేక - 'ప్రాణాలు దక్కించుకో' - అని. ఇది వీరత్వం చూపవలసిన సమయం - అవసరం కూడా లేదు - కాదనుకున్నాను - ఎదురుగా టెలిఫోన్ బూత్ - ఒక్క అంగ హనుమంతుడు సముద్రం దాటినట్లు వేసి లోపల తలుపు బిడాయించుకుని చూస్తున్నాను.

ఆ ఆబోతు మహా భీకరంగా ఉంది. నే నప్పుడే విడిచిపెట్టిన హోటల్ గుమ్మం దగ్గరకు పోయి - సైకిళ్ళన్నీ చిందర వందర చేసింది. ఎవరో ఆఫీసు బంట్రోతు విడిచిపెట్టిన ఉత్తరాల సంచి - సవిలాసంగా కొమ్ములకి గుచ్చుకుని - అలంకరించుకుంది.

అటూ ఇటూ చూసింది - పేవ్‌మెంట్ దుకాణదారుడు - హడావిడిలో పడవేసిన అరటిపళ్ళ అత్తం - రుచి చూసి - తినేసింది - హోటల్ గుమ్మంలోంచి బిగ్గరగా నే రోదన ధ్వనులవంటి శబ్దతరంగాలు - బహుశా యజమాని అయిఉంటాడు.

సరాసరి నే నున్న 'బూత్' దగ్గరకు వచ్చింది. అటూ ఇటూ చూసింది. తోక పైకెత్తింది. గాజు తలుపును నాకింది - తిన్నగా రోడ్డుమధ్యకు పోయి - హోటల్ వైపు తలపెట్టి - నిలబడి ఉంది.

దానికి వెనకగా - ఒక పెద్దమనిషి - గొడుగు - పైన ఎర్రగుడ్డ - తల వంచుకుని - రోడ్డుమీద వస్తున్నాడు.

నేనే కాదు - అక్కడి అశేషప్రాణికోటి - ప్రాణాయామం పట్టి ఫలితంకోసం నిరీక్షిస్తున్నాం.

ఆ పెద్దమనిషి ఆంబోతుని చూడలేదు. అది ఆయనను పసికట్టలేదు. తల వంచుకుని ఉన్నాడేమో. అడ్డంగాఉన్న ఆంబోతు వీపుకు కొట్టుకున్నాడు. మా ప్రాణాలు నిలువునా పైకెగిరిపోయాయి. అప్పుడు చూసినట్లున్నాడు - చేత్తో ఒక దెబ్బ కొట్టి 'ఫోఫో' అన్నాడు - అది చలించలేదు - కొంచెం చిరాకుతో - చేతిలో గొడుగు ముడిచి, దానితో ఆంబోతు పిర్రమీద ఒకటి ముట్టించి, మార్గ మిదికాయా - రోడ్డు చూపించి అదిలించాడు - ఆంబోతు చల్లగా తల పక్కకి త్రిప్పి - ఆ పెద్దమనిషి చూపించిన మార్గాన్నే నెమ్మదిగా నడక ప్రారంభించింది. దాని

# "బీదలపాట్లు"

(24-వ పేజీ తరువాయి)

పోకటం ఏమంత గొప్ప నేరం కాజాలదు! అయినప్పటికి పోలీసుఅధికారి కరుణా కటణ్ని కన్నంలో పట్టుబడ్డ దొంగలాగా చూడటమే కాక కథానాయకుడు అతని బారినుండి తప్పించుకోవటానికి పారిపోయి పురుషోత్తము డనిపేరు మార్చుకుంటాడు. ఇది పూర్తిగా అనవసరకల్పన.

ఇటువంటి లోపాలున్నప్పటికీ "బీదలపాట్లు" చిత్రం చాలానింపుగా ఉన్నది. మామూలు తెలుగు చిత్రాలలోకంటె "ముక్కు" ఇందులో చాలా తక్కువ ఒకసన్ని వేశంనంటు వేరొకటి వేగంవచ్చేస్తుంది. అందుచేత చిత్రంనడకలో కుంటుతేదు.

నాగయ్య, లలిత, పద్మిని, రాజం మొదలైన కొద్దిమంది గొంతుకలుతప్ప మిగిలినవన్నీ "డబ్" చేసిన గొంతులే. డబింగ్ జరుగవలసినంత జయప్రదంగా జరుగలేదు. ఈ విషయం చిత్రనిర్మాతలు శ్రద్ధతీసుకున్నట్టయితే ఈ చిత్రం ఎన్నోరెట్లు రక్తిగా ఉండేది. డబింగ్‌లో జరుగవలసిన లోపాలన్నీ జరిగాయి. ఒకే కంఠస్వరం రెండు మూడు పాత్రలకు ఉపయోగించటం, కొన్ని పాత్రలకు ఉచితమైనటువంటి గొంతులు ఉండకపోవటం, సౌండ్ సరిగా "సింక్" కాకపోవటం. డబింగ్‌కు సరిఅయిన వారిని ఏరుకుని తాపీగా పనిసాగించినట్లయితే ఈ లోపాలన్నీ సర్దుకుని ఉండేవే.

స్వయంగా సంభాషణలు చెప్పినవారిలో రాజం, లలితా, పద్మినీ కూడా చాలాయాస తెలుగు మాట్లాడారు. ఇటువంటి యాసహాస్యరసప్రధానపాత్రలకు నప్పుతుందిగాని గంభీరమైన కరుణామయ పాత్రలకు నప్పదు.

చిత్రంలో ఒకటిరెండు నాట్యాలు అనవసర మనిపించాయి గాని అకారణంగా పాటలు ప్రవేశపెట్టడం జరగలేదు. బలవంతాన తెచ్చిపెట్టిన హాస్యంకూడా ఇందులో లేదు.

నటనలో ఇంచుమించు అందరు బాగానే చేశారు. నాగయ్యనటన ప్రత్యేకించి చిత్రానికి జీవం పోసింది. మిగిలినవారిలో శామా, బాలయ్య, సీతారామన్ చక్కగా నటించారు. అంజల పాత్రను లలిత చాలాసమర్థతతో నిర్వహించింది,

డైరక్షను, ఫొటోగ్రఫీ, సౌండ్ రికార్డింగూ బాగానే ఉన్నాయి. మతగురువు సంభాషణలోనూ, ఇతరచోట్లా గాంభీర్యం కోసమో, ఉదాత్తతకోసమో గ్రాంధికం వాడారు. ఇది కేవలం అనవసరం. ఇటువంటిభ్రమ ఇటీవల ఎవరూ ప్రదర్శించటం లేదు. వ్యావహారికంలోరాని ఉదాత్తత గ్రాంధికంలో ఎన్నటికీరాదు. పాటలు సుమారుగా ఉన్నాయి.

మొత్తంమీద "బీదలపాట్లు" అందరూ ఆదరించదగిన చిత్రం.

---

వెనకాలే - వీపుమీద ఒకటి - నడ్డిమీద ఒకటి - వడ్డిస్తూ - ఆయన అలాగే పక్కసందులోకి దాన్ని తరిమివేసి, తన దారిని చక్కా పోయాడు. కథ కంచికి వెళ్ళకముందే నేను టెలిఫోన్ క్రియాస్కులోంచి బయట పడ్డాను.

ఆయన ఆ ఊరిహైస్కూలులో ప్రధానాధ్యాపకుడు - చదువుకోవటమే కాదు - చదువు చెప్పటం కూడా.

ఆ అంబోతంటె

ఆ ఊరిలో సింహస్వప్నం.



# పక్షుల భాష

(43 వ పేజీ తరువాయి)

"ఆఁ అతని కుడిభుజంమీద పెద్ద పుట్టుమచ్చ వున్నది." అన్నదామె.

మదనుడు చొక్కా తీసి కుడిభుజం చూపించాడు. దానిమీద పెద్ద పుట్టుమచ్చ వున్నది.

తల్లి సంతోషంతో, "నువ్వేనా మదనా! బతికున్నావా తండ్రీ!" అని కొడుకుని కావిలించుకు ఏడ్చింది.

మదనుడు తన తండ్రి చేసిన మోసాన్ని క్షమించాడు.

"చూశావా? ఆనాడు ఆ ఓడలో పక్షులు చెప్పిన జోస్యం నిజమైంది. నేను రాజునయ్యాను. నాదగ్గిర నువ్వు నౌకరుగా పని చేశావు." అన్నాడు మదనుడు. తండ్రి సిగ్గుతో తలవంచుకున్నాడు.

మదనుడు అదివరకే తనను కాపాడిన బెస్తదంపతులను తల్లిదండ్రులుగా పూజిస్తూ దగ్గర వుంచుకున్నాడు. ఇప్పుడు అసలు తల్లిదండ్రులను కూడా తనవద్దనే వుంచుకుని సుఖంగా రాజ్యంచేస్తున్నాడు.

---

## తమాషాప్రశ్నల జవాబులు

(1) 6 వీసెలు తూగగా మిగిలిన తూకం పెట్టెబరువులో సగం వున్నది. అనగా మరొక 6 వీసె లున్నదన్నమాట. కనుక మొత్తం బరువు 12 వీసెలు.

(2) నేను పావుగంటలోను మైలుదూరం నడిచి బండిని కలుసుకున్నాను; అంటే ఆ పావుగంటలోను బండి ఫర్లాంగుతక్కువ మైలుదూరం నడిచింది. గంటలో 4 ఫర్లాంగులు తక్కువ 4 మైళ్లు నడుస్తుంది. కనుక బండివేగం $3\frac{1}{2}$ మైళ్లు.

(3) 4 గుడ్లు. ఒక కోడిపెట్ట $1\frac{1}{2}$ రోజుల్లో ఒక గుడ్డు పెడుతుంది. 3 రోజుల్లో రెండు గుడ్లు' 6 రోజుల్లో 4 గుడ్లు పెడుతుంది.

---

# మద్రాసు మ్యూజియం థియేటరులో త్వరలో జరుగనున్న షేక్స్పియర్ నాటక ప్రదర్శనల తాలూకు దృశ్యాలు



"ఒథెలో" లోని దృశ్యం.



"జూలియస్ సీజర్" లోని దృశ్యం.

Regd. No. M. 4479





కళాప్రపూర్ణ

కీ॥ శే॥

కాశీనాథుని నాగేశ్వరరావుగారి

ఉత్కృష్టరచన

# ఆంధ్రవాఙ్మయ చరిత్ర

శాస్త్రపద్ధతిని, సంగ్రహరూపంలో నడిచిన సమగ్రసమీక్ష. వెయ్యేండ్ల వాఙ్మయ చరిత్రకు విశుద్ధదర్పణం. పాతచరిత్రల నన్నిటిని అవలోడన చేసి, సమన్వయించి క్రోడీకరించిన సినలయిన చరిత్ర.

శాసనాలలోనూ వాటిలోనూ అవ్యక్తస్వరూపంలో ఉండి ఉండి, నన్నయధర్మమా అని ఒక్క ఊపున దివ్యాకారంలో బైటపడి, నానాటికి నవనవోజ్జ్వలంగా వికసించిన మన వాఙ్మయం పోయిన పలుపోకడలను పోడిమితో చూపెట్టజాలిన ఉత్తమగ్రంథం.

**వెల రూ. 2-0-0** తపాలాఖర్చు **0-7-0**

## ఆంధ్రగ్రంథమాల

పోస్టుబాక్సు 212, మదరాసు 1.

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, ThambuChetty St, Madras